# 1980



# ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం

# 1990

రజతోత్సవ సాహితీ సదస్సు

# ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం
## (1980-1990)
### సమీక్షా వ్యాసాలు



రజతోత్సవ సాహితీ సదస్సు

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

EE DASABDAMLO TELUGU SAHITYAM : (1980-90)
An anthology of essays in Telugu by eight scholars presented at the symposium held on 4-2-1990 on the occassion of Silver Jubilee of Yuva Bharathi.



యువభారతి
(రజతోత్సవ సంవత్సరం 1990)

ప్రచురణ : 125

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1990

ప్రతులు : 1200

ముఖచిత్రాలంకరణం : శ్రీ శీలా వీర్రాజు

**వెల : రూ. 20-00**

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029

ముఖచిత్ర ముద్రణ :
**బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్**
చిక్కడపల్లి, హైదరాబాదు 500 020

ప్రతులకు :

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనము
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001



# యువభారతి

## రజతోత్సవ సాహితీ సదస్సు

సమాజంలో సాహిత్య చైతన్యాన్ని, సాహిత్య సదవగాహననూ పెంపొందించి, ఉత్తమ సాహిత్యాన్ని సహృదయులకు అందించటంలో కడచిన 25 ఏళ్ళుగా యువభారతి నిరంతర కృషి, దీక్షతో సాగిస్తున్నది. '1990' యువభారతి రజతోత్సవ సంవత్సరం. ఈ ఏడాది పొడుగునా విశేష కార్యక్రమాలను సాహిత్య ప్రచురణలను యువభారతి చేపడుతున్నది. సమకాలీన సాహిత్యాన్ని సమదృష్టితో సమీక్షించి, దానిలోని ఉత్తమ విలువలను అందించే కార్యక్రమంగా 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980-1990)' అనే సాహితీ సదస్సును 1990 ఫిబ్రవరి 4వ తేదీ ఆదివారం నాడు యువభారతి నిర్వహిస్తున్నది. ఈ సదస్సులో వ్యాసాలను సమర్పించిన డా॥ నాయని కృష్ణకుమారి గారికి, డా॥ ముదిగొండ వీరభద్రయ్య గారికి, డా॥ కాత్యాయనీ విద్మహే గారికి, శ్రీ వాకాటి పాండురంగారావు గారికి, డా॥ పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారికి, డా॥ కోవెల సంపత్కుమారాచార్య గారికి, శ్రీ శాంతిస్వరూప్ గారికీ కృతజ్ఞతలు. ఆయా రంగాల్లో నిష్ణాతులైన ఈ రచయితలు వ్యాసాల్లో స్వతంత్రంగా వ్యక్తం చేసిన భావాలు వారివి మాత్రమే. యువభారతి విభిన్న స్వరాల రాగమేళగా ఈ సదస్సును భావిస్తోంది. రచయితల భావాలకు యువభారతి బాధ్యురాలు కాదు. ఇది కేవలం ఒక చర్చా వేదిక మాత్రమే.

ఈ గ్రంథాన్ని దయతో ఆవిష్కరించిన ఆచార్య సి. నారాయణరెడ్డి గారికీ, 'పరిశోధనా పద్ధతులు' గ్రంథాన్ని ఆవిష్కరించిన వాస్తుశిల్పి శ్రీ బి. ఎన్. రెడ్డిగారికీ, ప్రారంభోత్సవ సభకు అధ్యక్షత వహించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, సదస్సులో పాల్గొన్న సాహితీ మూర్తులను సత్కరించిన శ్రీ కె. జగన్నాథం (అశోకఫాన్స్ సంస్థ అధిపతులు) గారికీ, ముఖచిత్రాలంకరణచేసిన శ్రీ శీలా వీర్రాజుగారికీ, ముద్రాపకులు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌వారికీ కృతజ్ఞతాభివందనలు.

జి. వి. సుబ్రహ్మణ్యం

అధ్యక్షుడు

# విషయసూచిక

# ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం

—డాక్టర్ నాయని కృష్ణకుమారి

ఏ కాలంలో సృజింపబడిన సాహిత్యానికైనా ఆ కాలంతో తర్కసహమైన సంబంధం ఉండి తీరుతుంది. ఒకవేళ కవి తనచుట్టూ ఉన్న సంఘాన్నీ, దాని అవసరాలనూ ప్రత్యక్షంగా తన రచనలో చెప్పకపోయినా, ఆ కవి యొక్క వైయక్తిక లక్షణంలోనో, అనుభూతిలోనో కాలం ప్రతిఫలించక ఊరుకోదు. కవి మామూలు మనుషుల మధ్య నివసించేవాడే కాని మంత్రనగర వాసి కాక పోవడం అందుకు ముఖ్యకారణం.

ఒక దశాబ్దంలో జరిగిన తెలుగు సాహిత్య వికాసాన్ని అంచనా కట్టడానికి ముందు, ఆ దశాబ్దంలో జన జీవితంపైన ప్రభావం చూపిన ముఖ్య రాజకీయ, సాంఘిక చారిత్రక ఘట్టాలేమైనా ఉన్నాయా అని విచారించవలసిన అవసరం ఉంది. అటువంటివి మిక్కిలి ప్రతిభావంతంగా రూపుదిద్దుకుని ఉంటేతప్ప, కవిని తీవ్రంగా కదిలించడమూ, తదనుగుణమైన రచనల్ని రూపుకట్టించడమూ, జరగదు.

మన దేశానికి బంగ్లాదేశ్‌తో యుద్ధం 1970లోనే మొదలై విరమింపబడడం జరిగింది. యుద్ధ విరమణ జరిగినా, దాని ఫలితం పెరిగిన ధరల రూపంలో జనాన్ని సంక్షోభంలో పెట్టకపోలేదు. 1962 చైనా యుద్ధకాలం నుండీ విడుపు లేకుండా సాగుతున్న, ధనవంతుడు అధిక ధనవంతుడు కావడం, బీదవాడు మరీ బీదవాడు కావడం అనే నిత్యక్రియ, రెండు యుద్ధాలమీద ప్రయాణం చేసి ఈ దశకంలోనూ (1980-90) సాగుతూనే ఉంది. ధరలభార మనేది మధ్యతరగతి మనిషిని పీడించినంతగా అటూ ఇటూ ఉన్న తరగతి భేదాలను వేధించదు. అందుకు కారణం,- కింది తరగతి వారికి జీవన పద్ధతిలో, తిండిలో భేషజం ఉండదు. పైతరగతివారు అటువంటి ఆటోపాన్ని ఎంతైనా వశం చేసుకో

గలరు. ఎటొచ్చీ, క్రింది తరగతి వారిని తమకన్నా తక్కువగా అంచనా వేసుకుని వారిని చిన్న చూపు చూస్తూ పై తరగతి వారిని తమకు ఆదర్శంగా భావించి, ఆ ఎత్తుకు ఎదగలేక అశక్తులుగా మారుతూ మధ్యలో నలిగిపోయేది ఈ మధ్యతరగతివారే మరొక విశేషమేమిటంటే సాహిత్య రచన చేయగలవారు ఎక్కువగా ఈ తరగతిలోనే ఉన్నారు. అందువల్ల, వాళ్ళు ఏ పక్షాన్ని అభిమానించి ఎవరివైపు చేరి తమ అభిప్రాయాల్ని సాహిత్యంలో పొదిగినా, అవన్నీ ఆ యా తరగతులపై మధ్యతరగతి వారు పేర్చుకున్న అభిప్రాయాలే అవుతాయికాని, అచ్చంగా ఆ తరగతులవారివే అని చెప్పడానికి కూడా వీలుపడదు. ఈ దశకంలో ఏ అడుగున పడిన మనిషి కోసం కవి సాహిత్య సృజన చేస్తున్నాడో, ఆ మనిషి అచ్చంగా తన బాధల్నీ గాధల్నీ సాహిత్యంలో పొదగడానికి శక్తి చాలని వాడు. మధ్యతరగతి కవి అతని తరుపున ప్రతినిధిగా అతని కష్టనష్టాలకు తాను ప్రతిస్పందించిన పద్ధతిని మాత్రమే ఆవిష్కరిస్తుంటాడు. అదే మనం ఈ దశకంలో కనిపించే కవిత్వంలో చూస్తున్నదీ, ప్రతిస్పందిస్తున్నదీ.

రాజకీయంగా, దేశం మొత్తం మీద, 1979 లో జనతాపాలన నుండి అధికారం తిరిగీ కాంగ్రెసు చేతుల్లోకి వచ్చేసింది. ఇందిరాగాంధీ హత్య జరిగిందీ ఈ దశకంలోనే. రాజీవ్ పాలనలో బోఫోర్స్ దుమారం చెలరేగడం, అధికారం తిరిగీ కాంగ్రెసు చేతుల్లో నుండి జారిపోయి నేషనల్ ఫ్రంట్ చేతుల్లోకి పోవడమూ ఈ కాలంలోనే. అట్లాగే రాష్ట్రపాలనలోనూ అధికార వినిమయం జరిగింది. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల మధ్య రవరవలు ప్రారంభం కావడమూ ఈ రోజుల్లోనే. ఇవన్నీ దేశ రాజకీయ జీవితంలో మైలురాళ్ళు కావచ్చు. కాని, సాహిత్యచరిత్రలో వీటికి పెద్ద ప్రాముఖ్యం ఉన్నట్లు తోచదు. చెదురు మదురుగా ఈ సంఘటనపై క్వచిత్తుగ కవిత్వం వెలువడినా, అది ఏరకంగానూ జనజీవితంపై ప్రభావం చూపలేదని చెప్పవచ్చు. అధికారాలూ, రాజకీయ సింహాసనాలూ నాయకులవే కాని, వాటితో మాకు ఒరిగేదీ తరిగేదీ లేదనే భావం జనంలోనూ, సాహిత్యంలోనూ కనిపించడంవల్లనే వాటికి, ఐరోపీయ తూర్పుదేశాలకుమల్లే చరిత్రను మార్చేంత శక్తి ఒనగూడ లేదు.

మధ్యతరగతికి చెందిన కవి మాత్రం జీవనరంగంలో సామాన్యుడు పడే బాధను అర్థం చేసుకునే ప్రయత్నాలను తన కవిత్వంలో చేశాడు. చేస్తూనే ఉన్నాడు.

1. ఒక కవి "తన చైతన్యాకాశంలోని పగటిచేతా రాత్రిచేతా ఎర్ర కాగడాలు పట్టిస్తాడు. ఆస్పర్శకు కవి గుండెకే నిప్పంటుకుని క్షణాలన్నీ గుండె చుట్టూ దీపాలై వెలగాలని తపిస్తాడు. అంతకుముందు స్తబ్ధంగా కదిలి వెళ్ళిపోయే కవికి గుండెలో తెర్లుతున్న విప్లవకాంక్ష అర్థమౌతుంది." (గుండెలో సముద్రం - అద్దేపల్లి రామమోహనరావు).

2. ఒక్కో కవి తానే విప్లవంగా మారి మనిషి భవిష్యత్తు కోసం పాటు పడాలని ఆక్రోశిస్తాడు.

"మనిషి భవితవ్యంకోసం అవిశ్రాంతంగా ఆరాటపడే అడ్రసు లేని మానవుణ్ణి నేను. చిరంజీవిని. చిరంతన సంజీవిని. నాపేరు మానవుడు. విప్లవం నా అసలు పేరు."

3. మరో కవి మనిషికోసం చేసిన ఉగ్రకవిత్వాన్ని ప్రతీకల మాటున పొదిగి అది సందేశహారి అవునో కాదో అన్న అయోమయ స్థితిలో పాఠకుణ్ణి ఉంచేస్తాడు. "చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం రాగం కోసం బిగించిన ఫిడేలులా పడిఉంది. వాడి నోరు పాడిన పాటల్ని ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి. చావులేని వాణ్ణి చంపిన మూర్ఖులకు తెలీదు ఏ మృత్తిక పువ్వును మనిషికి కానుకగా ఇస్తుందో అది వాడి నిర్మాణంలో ఉందని"-(వీరుడు-శేషేంద్రశర్మ).

4. ఒక్కో కవిత్వం నిరాశను వ్యక్తం చేస్తూనే ఆశవైపు అడుగులువేస్తూ ప్రయాణిస్తుంది. ఈ ఆశ వ్యక్తికి సంబంధించిన, భావవాద బలంతో కూడిన ఆశ కావచ్చు. లేదా సమాజాన్ని స్పర్శించే భౌతికవాద ప్రేరకమైన ఆశయినా కావచ్చును. "ముందు ఏముందో తెలీని ప్రయాణంలో, వర్తమాన ప్రతిక్షణం ఒక్కొక్క మౌనదీపమై చూపించే దారిలో, అడుగుతీసి అడుగువేస్తూ ఉదయంపై ఆశతో రాత్రి గడుస్తూనే ఉంది." (నాకు జ్ఞాపకం ఉంది-మాదిరాజు రంగారావు)

5. సమాజ పురోగమనం మీద ఆశ పెంచుకున్న కవులకుమల్లే నిరాశలో మునిగేవారూ కనిపిస్తారు. "ఈ తామరాకుమీద నీటిబొట్టుబతుకు నా కక్కరలేదు. ఈ ఒంటరితనమెందుకు? కూటికీ గాటికీ అక్కరకురాని ఈ అవిటితన మెందుకు? అందుకే ఈ ఆకునుండి నేలకు దూకుతా, నింగి కెగురుతా చివరకు కన్నతల్లి ఒడిలో కూలిపోతా తాదాత్మ్యం చెందిపోతా (నీటిబొట్టు - కసిరెడ్డి). కవి సమాజానికి ఏమీ చేయలేని ఒంటరితనం నుండి విముక్తి చలనక్రియను ఆహ్వానిస్తున్నాడు. దానివల్ల ఫలితం దొరక్కపోతే అమ్మ ఒళ్ళో కళ్ళు మూస్తాడు. ఏదో చెయ్యాలనే తపన ఏమీ చెయ్యిలేమోనన్న నిరాశ, తల్లిమీద, లేదా దేశంమీద ప్రేమ. ఇవన్నీ, నిష్ప్రయోజనంగా పడిఉన్న యువతను ఉద్బోధించడానికి వాడుకుంటాడు కవి. ఇటువంటి, ఆశా నిరాశల మధ్య మధ్యతరగతి మన స్తత్వాన్ని ఊగించే కవిత్వం ఈ దశకంలో ఎంతో వచ్చింది.

సమాజంలో కవి, తోటి వ్యక్తిని, వాడి కష్ట సుఖాలను అంచనావేసే స్థితి నుండి, అందుకు భిన్నంగా, ఒక పార్టీ ప్రణాళికను దృష్టిలో ఉంచుకుని దానికి ప్రచారం తెచ్చే నిమిత్తమై సమాజాధ్యయనాన్ని తదనుగుణంగా కవిత్వంలో తీర్చే పద్ధతి అభ్యుదయ కవితోద్యమంతో ఆరభంమైందని అందరికీ తెలిసినవిషయమే. ఇందువల్ల సామాన్యుడు నాయకుడైనాడు. వాడి బరువు బాధ్యతలు, కష్ట నష్టాలు వెలుగులోనికి రావడం మొదలైనాయి. మార్క్స్ సిద్ధాంతమైన వర్గరహిత సమాజ సృష్టిని ఈ కవులు తమ ధ్యేయంగా కూర్చుకుని తాము నిబద్ధ కవులుగా (Committed writers గా) ముద్ర వేయించుకున్నారు. 1948 లో ఉద్భవించిన అభ్యుదయ రచయితల సంఘం దాదాపు 20 ఏండ్లపాటు తన ఉనికిని కాపాడుకునే గట్టి ప్రయత్నం చేసింది. 1962 లో ఇండియా చైనాల మధ్య సంభవించిన యుద్ధం జనజీవితంలో ద్రవ్యోల్బణాన్ని తెచ్చింది. అడుగు మనిషి మరీ అణిగి పోవడం జరిగింది. కవిత ఒల్లుకుంటూ, ఆ స్థితికి కూడా మాంద్యాన్ని పట్టించుకుంటున్న అభ్యుదయ రచయితలపై కొందరు తిరుగుబాటు దారులు కారాలు మిరియాలు నూరసాగారు. ఆ నిర్వీర్యస్థితికి విద్యుచ్చికిత్స (Shock treatment) అవసరమని భావించిన ఆరుగురు కవులు తాము దిగంబర కవుల మని ప్రకటించి అర్ధరాత్రి జన్మనందుకున్నారు. కాని, తిట్లు, అశ్లీల పదాలతో, జుగుప్సతో Antisentiment ను సృజించే ఈ ధోరణి జనానికి నచ్చక

మూడేళ్ళు, మూడు సంపుటాలూ, ఆరుగురు కవులుగా, ఇది పూప ప్రాయంలోనే 1968 నాటికి తన బ్రతుకుతెల్లార్చుకుని వెళ్ళిపోయింది - ఈ దశకం పరిధి లోనికి దిగంబరకవిత్వం రాకపోయినా, దీనిని ఆధారంగా చేసుకుని, దీని సమాధి మీదనే విప్లవ కవిత్వం ఆవిర్భవించింది కనుక దీని ప్రసక్తి ఇక్కడ ముఖ్యమే. విప్లవకవిగా మారిన తొలి దిగంబరకవి జ్వాలాముఖి నక్షత్రాలు రాలంధే ఉజ్జ్వల ఉదయం ప్రభవించదనీ, నగ్నముని ప్రతి తల్లీ ఒక సూర్యుణ్ణి ప్రసవిస్తే చాలు అనీ తమకవిత్వపు దారిని తిట్లబాట నుండి పోరాటపు మార్గానికి మార్చుకున్నారు. ఈ నాటికీ విప్లవకవిత మావో వాదనను అనుస రిస్తూ అభ్యుదయ కవులు నిర్వచించిన మార్క్సు వాదాన్ని తిరస్కరిస్తూ, సమాంతరంగా వృద్ధిచెందుతున్న భావవాదంతోనూ, అనుభవ కవన రీతితోనూ పోట్లాటలు పెట్టుకుంటూ నిశ్శబ్ద పయనం చేస్తూనే ఉంది. కాని, సమాజంలో శాంతి యుతంగా ఏదీ జరగదనీ, పెన్నుకూ గన్నుకూ సమన్వయం కూర్చడమే విరసం ధ్యేయమనీ ఒకానొక చారిత్రక అవసరంలో నుండి సంఘర్షణలో నుండి విరసం ఆవిర్భవించింది కనుక ఆ కవిత్వం జనులను ఉత్తేజింప చేస్తుందే కాని సమన్వయ మార్గాలు వెదకదనీ విరసం కవులు స్పష్టం చేయడం వలన, దాన్ని ఆమోదించే జనం బహుళంగా లేరు. కాని, అది ఆవేశపూరితాలైన యువకుల కలాల్లో ఈ దశకంలో కనిపిస్తూనే ఉంది. విప్లవ కవుల సంకలనాలు ఝంఝ తిరగబడు, లే, వంటి సంకలనాలు రావలసినంత ఎక్కువగా ఈ పది సంవత్స రాలలో రాలేదని చెప్పవచ్చు. చాలాభాగం రచనలు కేకలుగా కనపడతాయి కాని కవిత్వంగా కనిపించక పోవడం కూడా ఇందుకో కారణం కావచ్చు.

అయితే విరసం ఈ పది సంవత్సరాలలో తెలుగు సాహిత్యానికి చేసిన మేలొకటి చెప్పక తప్పదు. ఈ దశకంలో 'పాట' ప్రాభవం పెరిగింది. "మృత వీరులు చిందించిన, రక్తంలో ప్రభవించిన, అగ్నిజ్వాల తారవనీ పాడుతాం పాడుతాం" అన్న చెరబండరాజు పాటలాంటి పాటలెన్నో ఈ దశకంలో జనిం చాయి. గద్దర్, వంగపండు, శివసాగర్ వంటి యువరచయితల సాహిత్యంలో కవితాత్మ కనిపించడమేకాక, వాళ్ళు జనానికి దగ్గరగా ఉండే జానపద రీతులను, పాటపాడే బాణీలతో ఆదరించారు; తెలుగు సాహిత్యంలోకి వాటిని ఈ దశకంలో రంగప్రవేశం చేయించారు.

'దచ్చన్న దారిలో దచ్చన్న దారిలో సీదారి నాదారి పోరుదారేరో దచ్చన్న దారిలో' అన్న గద్దర్ రచించిన జానపద బాణీ ఇందుకు ఉదాహరణ. ఇటువంటి పాటలను కేవలం చదువుకోమని, చదువురాని సామాన్యుల మధ్యకు పుస్తక రూపంలో విసిరేయడం కాకుండా, పాడి, ప్రదర్శించి ప్రచారసాధనంగా ఈ నాటికీ వాడుతుండడం విప్లవ రచయితల కానుక సాహిత్యానికి. మౌఖిక పద్ధతిని పునరుద్ధరించడమనేది కవితారంగానికి అవసరమని మనం తిరిగి గుర్తించవలసి ఉంది.

భౌతికవాద కవిత ఈ రకంగా సాగుతుంటే భావవాద కవిత కూడా సరి నడకలు నడవడం మనం చూడవచ్చు. అనుభూతి కవితగా నామాంతరం సంపాదించుకున్న, తొలినాటి భావకవిత ఈ దశకంలో ఎక్కువగానే కనిపిస్తుంది. పది పదిహేను సంవత్సరాలు (30-44) మాత్రం బ్రతికి చచ్చిపోయిందనీ, అది పలాయన వాద కవిత్వం కనుక దాన్ని జనం నిరాకరించారనీ, భౌతిక వాదులు చిలక పలుకులు పలికినా, కాల్పనిక కవిత్వం చచ్చిపోలేదనీ, అది పునరుజ్జీవితమైయీ దశకంలో మరింత శక్తిమంతంగా కనిపిస్తున్నదనీ నిరూపించవచ్చు. ఒక పార్టీ సిద్ధాంతానికో, ఇజానికో కట్టుబడి ఉండాలన్న నిబద్ధత లేనిది ఈ కవిత్వం. అంత మాత్రం చేత కవిత్వం కవి ఆత్మకథనాన్ని వెలువరించాలే కాని సంఘ ప్రయోజనం ఉండనక్కర లేదన్న ఊహలో మడికట్టుకున్న వాళ్ళు కాదు వీళ్ళు. వీళ్ళ కవిత్వంలో కూడా సమకాలిక సమస్యలూ, స్థితిగతులూ ప్రతిబింబిస్తూ ఉంటాయి. కాకపోతే అటువంటివన్నీ కవిని ఆశ్రయించుకుని ఉండడం వల్ల కవి ప్రథమ స్థానీయుడూ, కవిత్వం ద్వితీయ స్థానీయమూ అయి భాసిస్తుంటుంది. సమాజ వాస్తవికతో పాటు కవి స్థానమూ, అతని ఆలోచనలకు కూడా ఇక్కడ ప్రాధాన్యం కనిపిస్తుంది.

తిలక్‌ను అనుభూతి కవిగా కొందరు చెప్పిన తరువాత, ఈ దశకంలో అటువంటి కవిత చాలా వచ్చింది. ఒక్కొక్క సారి ఈ అనుభూతి కొన్ని కవితా నిర్మాణ ప్రయోగాలతో కూడి కనిపిస్తూంటుంది. అనుభవాన్ని ప్రతీకల చాటున పొదిగి ప్రతీకాత్మక కవితా నిర్మాణాన్ని నిలబెట్టిన శేషేంద్రశర్మ, బింబాలతో (Image) మాటుపరిచి, నిర్మాణ కౌశలం చూపించిన ఇస్మాయిల్, ఈ రెండు

నిర్మాణాత్మక ధోరణుల్ని ప్రాయోగికంగా స్పష్టంచేయ బూనిన సత్య శ్రీమన్నారాయణ, వేగుంట మోహన్ ప్రసాద్ ఈ అనుభూతివాదాన్ని సంపుష్టం చేసిన కొందరు. ఆ ఛాయలలో, ఈ దశకంలో ఎందరో యువకులు కవిత్వా విష్కారం చేస్తున్నారు.

ఈ దశకానికి సంబంధించిన మరొక వాదం స్త్రీవాదకవిత. అంతర్జాతీయ మహిళా సంస్థ ఆవిర్భవించాక, దేశ దేశాల్లో దాని ప్రాముఖ్యం ప్రసరించింది. పురుషాహంకారం స్త్రీ నెలా అణగద్రొక్కుతూ ఉందో, ముఖ్యంగా, సాంఘిక రంగంలో, స్త్రీలు గమనించ నారంభించారు. సమాజంలోని ఆడా, మగలను,రెండు వర్గాలుగా విభజించి,ఎన్ని అత్యాచారాలను, పురుషులు స్త్రీపరంగా చేస్తున్నారో వివరింపబడ్డాయి. కుటుంబంలో ఆవిడకు కల బానిసతనం, ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం, తన కాళ్ళ మీద తాను నిలుచొని బ్రతకలేక పోవడం, న్యాయశాస్త్ర పరంగా తనకు జరుగుతున్న అన్యాయాలు, వాటిని భరించలేని స్త్రీల ఆత్మహత్యలు, కట్నం చావులు వంటివెన్నో కవిత్వ విషయాలుగా స్త్రీవాద కవిత ఉద్భవించింది 1980 ప్రాంతంలోనే. అది ఈనాటికీ కొనసాగుతూనే ఉంది. ఇందులో ప్రముఖపాత్ర వహిస్తున్నది స్త్రీలే. జయప్రభ, కొండేపూడి నిర్మల, ఘంటసాల నిర్మల వంటి వారీ రంగంలో ప్రశస్తి కన్న వారు. జయప్రభ వ్రాసిన పైట అనే ఖండికలో పైట స్త్రీత్వానికి ప్రతినిధి అయి, తన గొంతు చుట్టూ గుండె చుట్టూ అది బిగిసి తన్ను స్వేచ్ఛగా ఎట్లా బ్రతకనీయకుండా చేస్తున్నదో చెప్తుంది.

ఎమినో సెంటసిస్ పరీక్ష ద్వారా పుట్టబోయేది స్త్రీశిశువని శాస్త్రం తెలియజేయగలదు. ఆడపిల్లలు అక్కరలేదనుకున్న వారు గర్భస్థ శిశుహననానికి పాల్పడుతున్నారన్న వార్త లొకటి రెండు చదివి, స్త్రీలు స్పందించిన తీరు ఈశ్వరి కవితలో మనం చూడవచ్చు. "నీకు మంచిరోజు లొస్తున్నాయి కన్నా! ఆడదిగా పుట్టానని అడవిలో మానైనా కాలేదని విలపించే రోజులు పోతున్నాయిలే తల్లీ! ఎందుకంటే నీవే పుట్టవుగా! అమ్మ పొట్టలోనే ప్లస్సువా మైనస్సువా అని తేల్చేసుకుంటారుగా నీవేనని నిర్ధారణ అయితే నిన్నక్కడే అంతమొందిస్తారుగా అందుకే నీకు మంచిరోజు లొచ్చాయిరా కన్నా!" అని వ్రాస్తుంది.

ఈ దశకంలో స్త్రీవాదోద్యమం కవయిత్రులనే కాక కవులను గూడా ఆకర్షించడం మనం గమనించవచ్చు. "నాగరికత కోరలతో మేధావి రాక్షసుడు అన్ని పిండాలనూ ఖండ ఖండాలుగా చీల్చి వీరభద్ర నృత్యం చేస్తుంటే ఇక్కడ దేవతలు ఇంకా క్రీడిస్తూనే ఉన్నారు.'' (యత్ర నార్యస్తు పూజ్యంతే-తంగిరాల) వంటి ఖండిక లిందుకు తార్కాణం. పురుషులు నిజంగా స్త్రీలను అణచివేస్తున్నారా? స్త్రీ విమోచనోద్యమం ఏమిటి? అనే సందేహ జీవులైన కవులు కూడా ఈ దశకంలో తలలెత్తుతూనే ఉన్నారు.

"అసూర్యంపశ్యల్ని చేస్తున్నది
పురాతనాచారాలలోని కట్టడి
అంగడి బొమ్మలుగా మారుస్తున్నది
నవీన నాగరకతలోని విచ్చలవిడి
అబలల జీవితాని కీ ప్రస్థానాలు
రెండూనూ
యమగండాలే
సుడిగుండాలే'' అంటున్నారు

(రెండూనూ - కిశోర్)

ఇవికాక అగ్గిపుల్లా కుక్కపిల్లా- అన్నీ కవితామయమే నన్న నమ్మకంతో, ఆ యా వస్తువుల్ని కేవలం చమత్కారం కోసమో, ఛందోవిన్యాసం కోసమో, పద ప్రయోగ కౌశలం కోసమో వినియోగించుకుని, కేవలం కళాత్మకంగా చెప్పే పద్యరచన కూడా ఈ దశకంలో కొనసాగుతూనే ఉంది. ఈ పదేళ్ళ కాలంలో ఇన్ని ధోరణులూ, మార్గాలూ కవిత్వంలో ఏర్పడ్డాయి.

## నవలలు :

నవలలను గురించి చెప్పవలసి వస్తే - ఈ దశకంలో తొలుతగా నవలను ప్రోత్సహిస్తున్నది పత్రిక, తరువాత సినిమా. ఈనాడు, నవల అనేది జీవితం లోని బృహత్తరమైన వైవిధ్యాలను చూపించే పెద్ద కాన్వాస్ అనే విషయం మరుగైపోయింది. ఒకానొక పత్రికా సంపాదకుడు ఒక సందర్భంలో వ్యక్తం చేసినట్లు నవలారచన విసుగు కలిగించేదిగా ఉండ కూడదు. విషయ మెంత ప్రయోజనకారి అయినా సీదా సాదా రచన పనికిరాదు. కథనం ఉత్తేజ పరిచేదిగా

ఉత్కంఠతను రేపేదిగా ఉండాలి. ముఖ్యంగా సీరియల్ నవలలలో ఈ లక్షణం లేకపోతే, పత్రికల అమ్మకాలు పెరగవు. కాల్పనికత ఎంతోకొంత ఉండడం అవసరం. అందువల్ల ఈ దశకంలోని నవలలన్నీ వాస్తవ విరుద్ధంగా గోచరిస్తున్నాయి. తెలుగు నవలా ప్రక్రియకు ఇది పత్రికలవారు పెట్టిన ముష్టి.

1960 - 70 ల మధ్య నవలా ప్రక్రియ నవలామణుల చేతుల్లో ఉండేది- భావుకత, కల్పన, త్రికోణ ప్రేమలూ, గొప్ప బీదల ప్రేమలూ, నాయిక అహంకారం, నాయకుని పట్టుదల, అపార్థాలు, కన్నీళ్ళు, విడిపోవడాలు వంటి కథావస్తువులతో స్త్రీలు రచయిత్రులై రాజ్యం చేయడం జరిగింది. అటువంటి రచనలు అంతకుముందు సామాజిక ప్రయోజనంకోసం రచించిన నవలా వస్తువును వెనక్కు నెట్టేశాయి. దాదాపు పది సంవత్సరాలపాటు ఈ ధోరణి విశృంఖలంగా రాజ్యమేలింది. ఈ రకమైన నవలలే తప్ప ప్రయోజనంకోసం వ్రాసిన వాటిని పత్రిక లప్పుడు ఎక్కువగా ప్రోత్సహించలేదు. ఈ నవలా ప్రవాహం మధ్య చిన్న చిన్న ద్వీపాల్లా ప్రయోజనాత్మక నవలలు లేవని కావు. అవి సంఖ్యలో బహు కొద్ది.

1970 ప్రాంతంలో పై ధోరణిని చెల్లాచెదరుచేస్తూ అశనిపాతంలా వచ్చి పడిన మరొక ధోరణి అతిమానుష, అవాస్తవమైన కథాకథనం కల నవలలు. మానవాతీత శక్తులు, క్షుద్ర విద్యలు, వీటికి ప్రాధాన్యమిస్తూ నవలలను రూపొందించే పద్ధతి ఒకటి స్థిరంగా పాతుకున్నది. అందుకు ప్రారంభకుడు యండమూరి వీరేంద్రనాథ్. అతని 'తులసిదళం' ప్రారంభనవల. ఇది జన బాహుళ్యంలో భయభీతుల్ని కలిగిస్తూనే ఆకర్షించింది. ఈ రకపు రచనలవల్ల పత్రికల అమ్మకాలు విపరీతంగా పెరగసాగాయి. అంతవరకూ ఆడ రచయితల కబ్జాలో ఉన్న నవలా ప్రక్రియ పురుష ప్రపంచం బలవంతంగా తిరిగీ లాక్కున్నట్లయింది. రచయిత్రులుకూడా ఆ మార్గాన్ని అనుసరించక తప్పడంలేదు.

నవలల్లో ఇటీవల 'స్త్రీ వాదం' కూడా ప్రవేశించిం దనవచ్చు. కాని, కవిత్వంలో లాగా ఈ నవలలు వాస్తవాన్ని ఆశ్రయించుకుని లేవు. పురుష ప్రపంచం మీద కసిచూపించడానికి ఇద్దరు స్త్రీలు వివాహం చేసుకోవడం, స్త్రీ వివాహాన్ని నిరాకరించడం వంటి ఇతివృత్తం ఈ నవలల్లో కనిపిస్తున్నది.

విప్లవ వాదాన్ని సమర్థించే నవలల్లో కఠిన సత్యాలకంటే కల్పనాంశాలు చోటు చేసుకుంటున్నాయి.

మరీ ఇటీవల ఈ కథనాన్ని కాదని, పరిశోధనాత్మక నవల (Investigating Novel) అనే పేరులో కొత్తరీతి నవల లొస్తున్నాయి. ఈ నవలలలో ఉన్న పరిశోధన నేతిబీరలో నేతివలె కాగా కథనానికి వెలిగా ప్రముఖంతో రచయిత తీసుకునే ఇంటర్వ్యూలు మాత్రమే కొత్త అంశం.

అయితే పత్రికలు పోటీకి ఆహ్వానించే నవలల్లో మాత్రం, గుడ్డిలో మెల్లగా, సాంఘిక ప్రయోజనం కల ఇతివృత్తం కనిపిస్తున్నది. పోటీలో గెలు పొందడానికి నవలల్లో సామాజిక ప్రయోజనాన్ని ప్రస్ఫుటం చెయ్యాలనీ, పత్రికల్లో సీరియల్ కావడానికి జనాన్ని ఉద్రేకపరిచే కల్పనాత్మకమైన మసాలా కావాలనీ, నవలారచయితలు తీర్మానించుకున్నట్లు అనిపిస్తున్నది.

## కథలు :

తెలుగులో 1910లో గురుజాడ దిద్దుబాటు వచ్చాక, ఆధునిక కథా వాఙ్మయం బహుముఖాలుగా విస్తరించింది. ఈ దశాబ్దంలోనే ఎన్నో కథా సంకలనాలు వచ్చాయి.- అందులో ప్రముఖమైనవి కొన్ని అమరావతి కథలు, చార్మినార్ కథల సంపుటి, బుర్రా సుబ్రహ్మణ్యం గారి జేబురుమాల కథల సంపుటి, విప్లవ రచయితల సంఘం వెలువరించిన ఇప్పుడు వీస్తున్నగాలి, పులికంటి కృష్ణారెడ్డి కథలు, ఇల్లిందల సరస్వతీదేవి స్వర్ణకమలాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ కథామందారం, ఆడవాళ్ళ కథలు ఇలా ఎన్నో ఉన్నాయి ఈ దశకంలో సులువుగా రెండు మూడు వందల మంచి కథలు వెలువడి ఉండవచ్చు ఇంత ఎక్కువగా కథలు పండడానికి ఆధారం వివిధ పత్రికా కేదారం అని చెప్పవచ్చు. ఈనాడు రచయితలు సొంతంగా వేసుకునే కథా సంపుటాల కంటే, తెలుగులో వచ్చే దిన, వార, పక్ష మాసపత్రికలు వాటిలోని సారస్వతానుబంధాలు కథల ప్రకాశనానికి ఎంతో సహాయం చేస్తున్నాయి. ఈ పత్రికల ద్వారా దాదాపు నెలకు 50 కథలయినా పఠితలకు అందుబాటులోకి వస్తున్నాయి.

జీవితం అనే కన్వాసు మీద పులిమేరంగులే ఈ కథలు. తాను జీవిస్తున్న లోకానికీ, తన అనుభవానికీ వెలిగా ఈనాడు ఏ రచయితా కథాసృష్టిచేస్తున్నట్లుగా అనిపించదు. దేవతలూ, రాక్షసులూ, అద్భుత శక్తులూ, అసాధ్య సాధనలూ గత కాలపు కథల్లో ఉండేవి గాని ఈనాడు కావు. ఈనాటి కథకుడు జీవితాన్ని తన రచనా వ్యాసంగంలో ముఖ్యపాత్రగా గ్రహిస్తున్నాడు.

ఈ కథల లక్షణా లిలా ఉంటున్నాయి.

1. జీవితంలోని చేదు వాస్తవాలను ప్రతిఫలించే కథలు
2. పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీల స్థితిని వర్ణించే కథలు
3. రాజకీయ కథలు
4. యజమాని సేవకుల అంతరాలు చూపే కథలు
5. మానసిక విశ్లేషణకు ప్రాధాన్య మిచ్చే కథలు.

ఇట్లా మరికొన్ని విభాగాలు చేయవచ్చు. ఇందులో దైవభక్తిని సమర్థించే మతపరమైన కథలుగాని, పనిగట్టుకుని నీతిని ప్రబోధించే కథలుగాని చాలా అరుదుగా కనిపిస్తున్నాయి. హాస్యానికి చోటిచ్చే ఆషామాషికథల కీమధ్య కొంత ప్రకాస్తి కలుగుతోంది. ఈ కథల నన్నిటినీ ఉదాహరణ పూర్వకంగా వివరించ వచ్చును గాని గ్రంథ విస్తర భీతిచేత మానేస్తున్నాను.

ఇటీవల కథలతోపాటు మినీ కథల జోరు కూడా బాగానేఉంది. ముఖ్యంగా, స్థలాన్ని పొదుపు చేసుకోవడానికి పత్రికాధిపతులు ఈ ప్రక్రియను ప్రోత్సహిస్తున్నా రనిపిస్తుంది. అంతేకాక ఔత్సాహిక రచయితల్ని ప్రోత్సహించడం కోసం వాళ్ళకు కొన్ని శీర్షికలలాంటి విచ్చి, వారిచేత వాటిపై కథలు వ్రాయిస్తున్నారు కూడా. అయితే ఈ మినీకథల్లో సామాజిక ప్రయోజనం కంటె హాస్యపు అంశం ఎక్కువగా ఉండడం గమనించవలసిన విషయం. ఒకవిధంగా ఇవి జోకులకు బృహద్రూపాలుగా తయారవుతున్నా, ప్రక్రియా విశేషమని పిస్తూంటుంది.

ఇక నాటక రచనను గురించి చెప్పడానికి పెద్దగా ఏమీ కనిపించ దీ దశకంలో. నాటకాలు ఆడడం మిగిలిన దక్షిణ దేశంలో లాగా ప్రోత్సాహ జనకం కాదు ఇక్కడ. కేరళ, తమిళనాడు, మహారాష్ట్ర వంటి రాష్ట్రాలలో, సినిమాలతో

సమానంగా నాటకాలు నడుస్తాయి. నెలల తరబడి సంచార నాటక శాలలు ఒక చోట డేరాలు పాతుకుని, ప్రదర్శనలు నిర్వహిస్తాయి. నాటక ప్రదర్శన ఎందరినో పోషించే కళగా అక్కడ నేటికీ రాణిస్తుంటుంది. అందువలన నాటక రచన వలన జీవించే రచయితలకూ,నాటకప్రయోగ వైవిధ్యాలకూ అక్కడ కొరతలేదు.

తెలుగు దేశంలో ఒకప్పుడు నాటకాలు బాగా ఆడేవి. పాండవోద్యోగ విజయాలు, చింతామణి, రోషనార వంటి అనేక నాటకాల ప్రాచుర్యం అందరికీ తెలిసిన విషయమే. మహారాష్ట్ర నాటక కుటుంబాలు కుటుంబాలే తెలుగు దేశంలో స్థిరపడి, నాటకా లాడడమే జీవనోపాధిగా, తెలుగు వారుగా మారిపోవడం కూడా జరిగింది. కాని, సినిమాలరాకతో నాటకరంగం వెనుకపడిపోవడం ఆంధ్ర దేశంలోనే జరిగిందనవచ్చు.

ఈ దశకంలో నాటక పరిషత్తు లేర్పడ్డాయి. పెద్దపెద్ద నాటకాలకు ఏకాంకికలు ప్రదర్శించడం అలవా టయింది. ఔత్సాహిక నాటక సంఘాల మధ్య పోటీలు నిర్వహించడం మూలంగా ఏకాంకికా రచనకూ, ప్రదర్శనకూ కొంత వీలుకలిగింది. ఆదివిష్ణు, వీరేంద్రనాథ్, ఆత్రేయ, వంటి వారు ఏకాంకికా రచనలో సిద్ధహస్తులు. పాశ్చాత్య నాటక ప్రయోగ కళను కూడా ప్రయోగాత్మకంగా చిత్రీకరించడం ఇక్కడ జరుగుతున్నది. Absurd plays, మైము ప్రక్రియలు తెలుగు సాహిత్యాన్ని ఈ దశకంలో ఉత్కంఠాత్మకంగా రూపు దిద్దుతున్నాయి.

## విమర్శ వ్యాసాలు :

విమర్శ వ్యాసం తెలుగు సాహిత్యాన్ని ఎప్పుడూ పరిపుష్టం చేస్తూనే ఉంది. కేంద్ర స్థాయిలో గత మూడు సంవత్సరాలుగా విమర్శ ప్రక్రియకే బహుమతులు రావడం అందుకు తార్కాణ అని చెప్పవచ్చు. ఈనాడు విమర్శ విశ్వవిద్యాయాల పరిశోధన ప్రణాళిక వలన మరీ సంపన్నంగా కనిపిస్తూ ఉంది. విమర్శన గ్రంథాలను ప్రచురించుకోవడానికి, విశ్వవిద్యాలయాలు, ప్రభుత్వ సాంస్కృతిక శాఖ T.T.D. సంస్థ వంటివి. చేయూతనివ్వడం వలన ఎన్నో గ్రంథాలు వివిధ విషయాలపైన వెలుగులోకి రావడం జరిగింది. సాంఘిక, రాజకీయ, సాహిత్య, భాషా విషయ ప్రధానాలైన విమర్శలూ, రచయితల జీవిత విశేషాలూ కూడా పాఠకుల కందుబాటులోనికి వచ్చాయి. ప్రతి గ్రంథాన్నీ పేర్కొనడానికి స్థలం చాలదు కనుక ఇంతటితో ఆపేస్తున్నాను.

చివరగా 1970 వరకూ సుప్తంగా పడిఉన్న జానపద సాహిత్య అధ్యయనం విమర్శ చాలా వేగాన్నందుకున్నది ఈ దశకంలోనే - ఆ సాహిత్యానికి సంబంధించిన అన్ని ప్రక్రియల మీదా పరిశోధనాత్మక విమర్శలు వెలువడడం ఈ దశకానికి కల విశిష్టత అని చెప్పవచ్చు. నవ్యసంప్రదాయవాద మనే కొత్త వాదమొకటి ఈదశకంలో నిర్దుష్టంగా రూపుదిద్దుకునే అవకాశం కనపడుతూ ఉంది.

1980-90ల మధ్య జరిగిన తెలుగు సాహిత్య వికాసాన్ని గురించి తెలుసుకున్నాక ఒక తీర్మానాన్ని ఈ సభాముఖాన చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

తెలుగు సాహిత్యాన్ని గురించి ఇన్ని సభలు చేసి, గోష్ఠులు నిర్వహించి, ఉపన్యాసాలిచ్చి మనం శ్రోతలను జాగృతం చేస్తున్న మాట నిజమే కాని, పఠితల ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకుంటే, మనం చేయవలసింది ఎంతో మిగిలే ఉందని చెప్పక తప్పదు. మన మెరిగిన ఇంగ్లీషు సాహిత్యంలో ఏ సంవత్సరం ఎంత సాహిత్యం వెలువడింది, ఏ ప్రక్రియలలో ఎవరెవరు కృషి చేశారు? అనే సహాయక ఆకరగ్రంథాలు ఎప్పుడూ వెలువడుతూనే ఉంటాయి(Companions)

గత పది సంవత్సరాలలో తెలుగులో ఎవరెవరు ఏ ప్రక్రియను చేతబట్టి, ఏ యే రచనలు వెలువరించారనే సమాచారాన్ని క్రోడీకరించ వలసిన అవసరం ఎంతైనా ఉంది. కనీసం, 1900 నుండి ప్రతి 10 సంవత్సరాలకు జరిగిన సాహిత్య సృజనను అమర్చడం శ్రమతో కూడుకున్న పనికాగలదేమో కాని అసాధ్యమైన పనికాదు.

యువభారతి తొలుదొల్తగా, 1980-90 మధ్యకాలంలో ఆవిష్కృతమైన తెలుగు సాహిత్యాన్ని ప్రక్రియాపరంగా, వేరువేరుగా క్రోడీకరించే బాధ్యత తీసుకోవాలనీ, అక్కడనుండి ప్రతి సంవత్సరం అటువంటి పనిని క్రమక్రమంగా 2000 వరకూ నిర్వహించాలని కోరుతున్నాను.

ఇది యువభారతికి వార్షికోత్సవాలను నిర్వహించడం కంటే ఎక్కువ కీర్తి కారకమూ, ప్రయోజనకరమూ కాగలదని నమ్ముతున్నాను.

# ఈ దశాబ్దంలో తెలుగు కవిత

—డా॥ ముదిగొండ వీరభద్రయ్య

తెలుగు కవిత్వానికి ఈ ఎనిమిదవ దశకం గుర్తుంచుకోదగిన దశాబ్దం. తెలుగు కావ్యానికి జ్ఞానపీఠ బహుమతి లభించడం ఈ దశాబ్దంలో గొప్ప గుర్తింపు. ఆచార్య సి. నారాయణరెడ్డిగారి 'విశ్వంభర' తెలుగు కవిత్వ కీర్తిని ఈ బహుమతితో జాతీయస్థాయికి పెంచింది.

ఎనిమిది ధోరణులు కవితలో ఊపిరి పోసికొన్న దశాబ్దం ఇది. బెంగాల్ నుంచి విజయసారథి(అధర మందారం), అమెరికానుంచి పెమ్మరాజు వేణుగోపాల రావు (కాస్మిక్ కవిత), మైసూరునుంచి ఆర్వీయస్. సుందరం (సుందర ప్రభవ), బెంగుళూరునుంచి తంగిరాల వెంకట సుబ్బారావు (గుండెపూసిన గులాబీ) వంటి ప్రవాసాంధ్రుల కవితా సంపుటలుకూడా ఈ దశాబ్దపు తెలుగు కవితకు పుష్టిని కలిగించాయి. ఒక్క వ్యక్తి ఈ దశాబ్దంలో వచ్చిన అన్ని కావ్యాలను సమీక్షించడం, అందునా పది పేజీలలో, సాధ్యం కాదు. అందువల్ల ఆయా ముఖ్య కావ్యాలను పరామర్శిస్తూ ప్రధాన ధోరణులను తెల్పడం మాత్రమే ఈ వ్యాసంలో ఈ వ్యాసకర్త చేయగలిగింది.

ఈ దశాబ్దంలో ఉన్న ధోరణులు గత దశాబ్దంలో లేవనికాదు. కాని, ఆ దశాబ్దంలోకన్నా ఇవి ఈ దశకంలో ఎక్కువ చిక్కబడినాయి. గత దశాబ్దంలో లేని కొత్త ధోరణి స్త్రీవాదం - అన్నది తెలుగు కవిత్వంలోకి ఈ దశాబ్దంలో ప్రవేశించింది. ఈ ధోరణిలో ఒకటి రెండు సంకలనాలు వచ్చాయి. ఈ దశాబ్దంలో వచ్చిన, కొనసాగుతున్న ధోరణులను వస్తురీత్యా కిందివిధంగా విశ్లేషించవచ్చును.

(1)అనుభూతి కవిత (2) జాతీయవాద కవిత (3) స్త్రీ (విముక్తి) వాద కవిత (4) మానవతా కవిత (5) తాత్త్విక కవిత (6) మార్క్సిస్టు కవిత (7) ఆత్మకథా కవిత (8) స్మృతి కవిత.

ప్రతీక, భావచిత్రం కవిత్వాభివ్యక్తిలో స్థిరపడినాయి. ఆలంకారిక అభివ్యక్తిలో కొందరు కవు లెంతో ప్రౌఢిమను సంపాదించుకున్నారు. వస్తు స్పష్టత కోసం కవిత్వాభివ్యక్తి వైశిష్ట్యాన్ని వదలుకొనే రాజకీయ కవులు కూడా, ఈ దశాబ్దంలో కవిత్వాభివ్యక్తితో చాలా వరకు రాజీపడకపోవడం గమనార్హం. కవిత్వం అర్థం కావడం, అర్థం కాకపోవడం - అన్న విషయంలో కూడా కొందరు సామాజిక స్పృహకవులు కవిత్వవిలువల వైపుకే మొగ్గడం ఈ దశాబ్దం ప్రత్యేకత. గత దశాబ్దంలో ఉద్యమంగా రూపొందిన మినీకవిత్వం స్థిరపడి అన్ని రకాల కవులు దాన్ని రాయడం, మరో విశేషం. మినీ కవిత్వంలో ధ్వని కవిత్వం, ఆలంకారమయంగా రూపొంది స్థిరపడింది. మరో విచిత్ర సన్నివేశం ఈ దశాబ్దంలో కనిపిస్తోంది. అత్యంత ఆధునిక విప్లవ సామాజిక స్పృహతో కవితలు రాస్తూకూడా వాటిని ఆధునిక ఇతిహాసాలుగా మలచడం ఒక విశేషం. భావాభ్యుదయ ఉద్యమాల రోజుల్లో నవ్య సంప్రదాయోద్యమం ఆ రెండింటిపై ప్రభావం ఎలా వేసిందో, అలాగే నేడు కూడా అనుభూతి విప్లవ కవిత్వాల వెల్లువలో అలాంటి నవ్య సంప్రదాయ రీతులు, ప్రభావాలు కనిపించడం విశేషం.

అనుభూతి కవిత్వ మార్గంలో ఇస్మాయిల్‌గారి 'రాత్రి వచ్చిన రహస్యపు వాన' చెప్పుకోదగిన సంపుటి. ఈ సంపుటిలోని కవితలలో 'గాడిద స్వామ్యం,' 'మార్క్సిస్ట్ మిత్రునికి,' 'వడ్రంగి పిట్ట' అనే రాజకీయ కవితలు కూడా ఉండటం విశేషం. విషయైక దృష్టితో, దృశ్యమాన వస్తుజాలం మీద, వర్తమాన రాజకీయ సిద్ధాంతాలమీద - వాటి దుష్ప్రభావాల మీద అల్లిన కవితలు ఇందులో కొన్ని ఉన్నవి. వడ్రంగి పిట్ట, మార్క్సిస్ట్ మిత్రునికి అన్న కవితలు వివాదాన్ని లేపినవి. [పీటిల్లోని వస్తువునకు ఖండనగా ఒక కవితను వరవరరావు గారు రాశారు.] మార్క్సిజం యొక్క కాలం చెల్లిన లక్షణాన్ని కవిత్వీకరించిన రచనలీ రెండు. మొదటి కవితలో (1985)

"తడారి పోయిన
ఎడారి ఇసకలో
ఒత్తిగిలి పడుకున్న
నత్తగుల్లవి.

నీ మార్క్సిజం మహాసముద్రం
నిన్ను విడిచి ఎన్నడో ఇంకిపోయింది.
నీ చెవిలోని హోరు
ఇంకా అదే ననుకుంటున్నావు"

అన్నమాటలు ఇవేళ రష్యాలోనూ, తూర్పు యూరోపులోను జరిగిన కమ్యూనిస్ట్ ప్రభుత్వాల పతనానికి ఐదు సంవత్సరాలు ముందుగానే ఇస్మాయిల్ గారు రాశారు. వీరి 'పికాసో' అన్న కవిత ఈ సంకలనంలో ఎంతో విలువైనది. స్వేచ్ఛను గురించి ఎంతో చక్కగా రాసిన కవిత ఇది—

"పికాసో చిత్రమైన
అచిత్రకారుడు
అతడు గీసింది కన్నా
చెరిపింది ఎక్కువ:
మన కళ్ళమీది కటకటాల్ని కుంచెతో చెరిపేశాడు
అప్పట్నించీ మనకళ్ళు
ఎగరటం నేర్చుకున్నాయి."

ఐతే ఇస్మాయిల్ మంచికవితాధర్మం ఉన్న కవితలతో పాటుగా అశ్లీల వస్తు ప్రధానమైన ప్రయివేట్ కవితల్ని కూడా రాసి తప్పుదారివేశారు. 'స్వారీ' 'నువ్వు' 'ఆట' 'బెల్లంకాయ' కవిత లిలాంటివే, ఐనా, ఈయన్ని అనుసరించి ఇలాంటి అశ్లీల కవితల్ని మరెవ్వరూ రాయక పోవడం గమనార్హం. కవిత్వంలో ఏమి రాయాలో అన్న విషయంతోపాటుగా, ఏమి రాయకూడదోకూడా ఈ తరం కవులు తెలిసికోగల్గుతుండడం హర్షణీయం. గోదావరి శర్మ (గోదావరి గలగలలు), శ్రీకాంతశర్మ, ఫణికుమార్ మొ॥న వాళ్ళు ఈ అనుభూతి కవితను దీక్షగా రాస్తున్న కవులు.

సామాజిక స్పృహతో జాతీయతా దృక్కోణంతో రాసిన కవితలు పుంఖాను పుంఖంగా ఈ దశాబ్దంలో వచ్చాయి. ఈ వర్గం కవులు ప్రధానంగా మానవతా వికాసానికి ప్రయత్నిస్తున్నారు. వీ రెన్నుకొన్న వస్తువు జాతీయతకు అనుకూలమైనది. ఈ వర్గంలో కొందరు అంతర్జాతీయతను ప్రబోధించిన వాళ్ళూ ఉన్నారు.

ఐతే జాతీయతను నిందిస్తూ, నిరసిస్తూ కాదు. ప్రాంతీయ, భాషా పరసంకుచిత త్వాలను ఎత్తిచూపుతూ, దేశం ఐకమత్యంగా ఉండాలని సూచిస్తూ తంగిరాల వెంకట సుబ్బారావుగారు రాసిన 'మోక్షం' అన్న కవిత (గుండెపూసిన గులాబీ-సంకలనంలో) ఈ రకం కవితల్లో ఎన్నదగింది.

"ఓ గురువాయూరప్పా !
నాకు కాదు
ఈ దేశానికి మోక్షాన్ని ప్రసాదించు"

అన్న పాదాలు కవి నేడు జాతీయత బలహీన పడ్తున్నందుకు ఎంతగా బాధపడ్తు న్నాడో తెలుపుతవి. ఈ సంపుటిలోని 'నాగస్వరం' కవిత చిన్నదే కాని మన జాతి జీవనంలోని తరతరాల అనైక్యతను కవితాత్మకంగా చూపుతుంది.

"తరతరాల కుబుసాలు ఊడ్చిన
పన్నెండు శిరసుల వృద్ధనాగేంద్రుడు
ఇప్పుడు
తన గ్రుడ్లు తానే భక్షిస్తున్న అంధుడు
ఎర్రకోటలో తఖ్తునెక్కి కూర్చుని
నాగస్వరం పడుతున్న రాజకుమారుడికి మాత్రం
ఎప్పటికైనా ఈ ముసలిపాము లేచి
ఆడకపోతుందా అనే ఆశ !"

ఈ రీతి కవిత్వంలో 'నా దేశానికి నాలుగు దిక్కులు' అన్న వీరి కవిత మకుటాయమానమైంది. తూరుపు నేతాజీ, పడమర గాంధీజీ, ఉత్తర నెహ్రూ, దక్షిణ జె. పి. అన్న ఉపశీర్షికలతో ఉన్న ఈ కవిత ఎంతో కొత్త రీతిలో రాసిన కవిత.

జాతీయతను బలిష్ఠం చేయడానికి పేర్వారం జగన్నాథం గారు అనేక కవితలు (కొన్ని అధిక్షేపాత్మకంగా) రాశారు. అవినీతి, అన్యాయాలను చూప డంతో పాటుగా 'మార్పు'ను వినాశాత్మకరీతిలో కాక నిర్మాణాత్మక రీతిలో

కోరడం వీరి 'వృషభపురాణం' అన్న సంకలనంలో కనిపిస్తుంది. ఇందులోని 'నిప్పుకణిక' కవితలో

"నిన్న నివు తోడేసిన పాలు
ఇవాళ చలికి తోడుకోలేదు. ఇప్పు డవి
అటు పాలూ - ఇటు పెరుగూ కానిస్థితి-
వృధాగా గోమాతను నిందించబోకు
పొరుగింటి పాడిపై మోజుచూపించకు
అందులో ఒక్క నిప్పు కణిక వేసి
మరికొంతకాలం ఓపికపట్టు"

అన్న పాదాలు పరిశీలించదగ్గవి.

జనువాడ రామస్వామిగారి 'కవితారామం' సంపుటిలో 'టెర్రరిజం' కవిత, ఆర్వీయస్. సుందరంగారి సుందర ప్రభవలోని 'మన చేతుల్ని వెదుక్కుందాం పదండి,' 'పులిగాండ్రించును, వీరులకో మాట' అన్న కవితలు రాజకీయ అతివాదుల, మతవాదుల టెర్రరిజాన్ని ఖండించే కవితలు.

"విప్లవమంటే పడవ పగల గొట్టడమనే అనుకుందాం-
ఈతంటే ఏమిటో తెలియని
ప్రజలున్న దేశంలో
పడవ పగల గొట్టడం వ్యర్థమే కదా?
పోనీ ఈత నేర్పిస్తారా అంటే
గజఈతగాళ్ళ మాట అటుండనివ్వండి
గజం ఈదే వాళ్ళు మీలో ఎంతమంది?"

(వీరులకోమాట) అన్న పాదాలు అతివాదుల ఆగడాలను ఆ రీతో ప్రశ్నించేవి.

"కవిత్వం రాయడం కష్టం కాదు కవిత్వం చెయ్యడం కష్టం" అని గుర్తించిన మంచికవి ఆర్వీయస్. సుందరం గారు.

జాతీయతా వాద కవులలో శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి (మహాభియానం), కసిరెడ్డి వెంకటరెడ్డి (సిందూరం) గారల కవితలు చెప్పుకోదగినవి.

"ఈ దేశం పొలాలలో
ఆ విత్తనాలు మొలకెత్తవు
...మీ వర్గ ద్వేషం పంటలు పండవు
...అనవసరంగా నిప్పు మూట కట్టుకోకండి"

అని సమాజాన్ని వర్గాలుగా చీల్చడాన్ని ముళ్ళపూడి వారు వ్యతిరేకించారు. కసిరెడ్డివారి 'సిందూరం' సంకలనంలో జాతీయతను బలపరిచే అనేక కవిత లున్నాయి. జాతీయతా వాదులలో మార్క్సిస్టులను నిందించడం అన్నది విశేషంగా కనిపిస్తున్న అంశం. 'ఎర్ర కుక్కలు', 'అడ్డగాడిద', 'ముంపు' మొ॥న కవితలు మార్క్సిస్టులను నిందిస్తూ రాసినవి. 'కొత్త దుస్తులు' (1985). 1989లో యూరోపులో జరిగిన వాటిని పసిగట్టి రాసిన మంచి కవిత.

"ఇంకా ఆ ఇరుకైన దుస్తుల్లో
ఇరుక్కుపోవాలని
ఎందు కనుకుంటావ్!
ఒరే తమ్ముడూ!
ఆ మరో ప్రపంచం చూడు
ఎప్పుడో
కొత్త దుస్తులు కుట్టించుకుంది."

ఇట్లాంటి కవితల్ని ఇస్మాయిల్ గారికన్నా కసిరెడ్డి ముందే రాశారు. జాతీయతా ధోరణిలో గన్ను కృష్ణమూర్తి, కందాళై, వేదాటి రఘుపతి, శ్రీనాథ్, డా॥ పొద్దుటూరి ఎల్లారెడ్డి, రామచంద్రాచార్యులు, ధరణి, పోతా చంద్రయ్య మొ॥న వాళ్ళు మంచి కవితలు రాశారు.

స్త్రీ విముక్తి, స్త్రీ స్వేచ్ఛ, స్త్రీని భోగ్య వస్తువుగా చూడక ఒక సమాన స్థాయి వ్యక్తిగా చూడడం, ఆమెను క్రూరంగా నిర్దాక్షిణ్యంగా చూడడాన్ని తిరస్కరించడం, పురుష సమాజం ఆధిక్యతను నిరసించడం వంటి అంశాలతో స్త్రీ వాద కవితలు బలంగా వచ్చిన దశాబ్దం ఇది. ఐతే ఈ వాదం సామాజిక ఉద్యమంగా బలపడక ముందే కవితల్లోనూ, ఇతర సాహిత్య ప్రక్రియలలోనూ బలం పుంజుకుంటున్నది. జయప్రభ, ఓల్గా, అబ్బూరి ఛాయాదేవి, కొండేపూడి

నిర్మల, ఘంటసాల నిర్మలలు ఈ ధోరణి కవితలు బలంగా రాస్తున్నారు. జయప్రభగారు ఈ స్త్రీవాదాన్ని ప్రధానంగా చేసి 'వామనుడి మూడోపాదం' అన్న సంకలనం అచ్చేసుకొన్నారు. "...కవిత్వ రంగాన ఇప్పటికీ పురుషాధి కృతే ఉన్నది. అది పోవాలనే నా ఆశ. పోవాలంటే ఆడవాళ్ళు స్వేచ్ఛగా తమ భావాలని ఆలపించేస్థితి రావటం ఒక్కటే పరిష్కారం అని నేననుకుంటున్నాను. అందుకోసం ఆడదానిగా రాస్తున్న కవిత్వం ఇది అని మళ్ళీ చెబుతున్నాను-" అని ఈ సంకలనంలో రాశా రీమె. 'పైటని తగలెయ్యాలి, ఎరుపుతోనే సంపూర్ణ స్త్రీని' వంటి కవితల్లో ఈనాటి స్త్రీలలో వస్తున్న - రానున్న - చైతన్యం కనిపిస్తున్నది. ఈ రకం కవులలో కూడా మార్క్సిస్ట్ భావజాలం కొందరిలో లేక పోలేదు. కాని, అది వీరి స్త్రీవాద ప్రబోధం కింద అణిగిపోయింది. మౌలికంగా వీళ్ళు మంచి కవులు. జయప్రభగారి 'స్పర్శానురాగాన్ని ఆలపిస్తూ' అన్న కవిత దీన్ని నిరూపిస్తుంది. ఇందువల్లనే - స్త్రీవాదం ఇంకా ఒక బలమైన ఉద్యమం కాకపోయినా - వీరి కవిత్వం మాత్రం పాఠకులను ఆకర్షిస్తున్నది. జయప్రభ గారి చూపులు తప్పక చదవాల్సిన కవిత. ఇది పీటాశ్రీశింగ్రీగారి An ordeal (కలియుగ సీతగా దేవరాజు మహారాజుగారు అనువాదం చేశారు) కవితను గుర్తుకు తెస్తుంది. ఘంటసాల నిర్మలగారి 'ఎ కాల్‌గరల్స్ మోనొలాగ్', కొండేపూడి నిర్మలగారి 'నడిచే గాయాలు, సర్కస్‌పిల్ల, లేబర్‌రూమ్, మదర్ సీరియస్' కవితలు ఎంతో గొప్పవి. సావిత్రిగారి 'బందిపోట్లు', రావులపల్లి సునీతగారి 'తల్లి గోడు', కె. అనూరాధగారి 'నిజమయ్యేకల', పి. అజయ్‌కుమార్‌గారి 'వెన్నెల తపస్సు', అరణ్యగారి 'వేట' అన్న కవితలు స్త్రీ వాదాన్ని కళాత్మకంగా కవిత్వీకరించినవి.

ఈ మార్గంలోని అంతశ్శాఖ, మార్క్సిజాన్ని విశ్వసిస్తూ ఆ దృక్పథంతో స్త్రీల సమస్యలను ఎలా అర్థం చేసికోవాలో, స్పందించాలో, చైతన్యం పెంచుకోవాలో తెలిపేవి. విమల గారిది ఈ రకమైన కవిత్వం. వీరు రాసిన 'అడవి ఉప్పొంగిన రాత్రి' సంకలనం ముందుమాటలోని ఈ క్రింది వాక్యాలు గమనార్హాలు: "మార్క్సిస్ట్ సిద్ధాంతాన్ని మొదలుకొని, మార్క్సిస్టు నిర్మాణం వరకు అనుమానంతోను, అసహనంతోనూ, అప్పుడప్పుడు వ్యతిరేకతతోనూ చూస్తూ పుట్టు

కొస్తున్న ప్రత్యేక మహిళా ఉద్యమాలకు ఈ కవితలు ఒక ప్రత్యామ్నాయపథ నిర్దేశాన్ని సరిగా చేస్తున్నాయని మా అవగాహన". ఈ కవయిత్రి రాసిన 'వేశ్యా శిశువు' మంచి కవిత.

"నువ్వొక రూపం దాల్చి
తల్లిగర్భంగోడల్ని తడుతూ
ఎందుకు పాపా!
ఆగమనానికై అంత తొందర పడతావ్
పొంచున్న ప్రమాదం తెలీక"

"దేశందేశమంతా కల్యాండీ లైనప్పుడు
ఎక్కడైనా నువ్వు అమ్ముడు పోతావ్
ఇక్కడ చివరకు పసిపిల్లల్ని ఎగుమతి చేస్తారు
ఏమైతేనేం, సరుకు - సరుకేకదా!" అన్న పాదాలూ,

"తినేందుకు తప్పా ఇటుకేసి రారు ఎవ్వరూ
ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మే రాణి
అయినా చివరకు వంటింటి గిన్నెలన్నిటిపైనా
మా నాన్న పేరే" అన్న 'వంటిల్లు' కవితలోని పాదాలూ

"స్త్రీలు—
మెరుపుల పిడికిళ్ళెత్తిన
పోరాట ప్రచండఘోషకు తెగబడిన దృశ్యాన్ని
ఓ! నా మిగిలిన సగం ప్రపంచమా!
నీ విప్పుడు వినక చూడక తప్పదు."

అన్న 'తెగబడిన మా కలల ప్రపంచం' కవితలోని పాదాలు కేవల స్త్రీ వాదాన్ని మార్క్సిస్ట్ దృక్కోణపు స్త్రీవాదాన్ని కూడా తెలుపుతాయి. ఐతే ఈ అంతశ్శాఖ ఇంకా బలపడ లేదు - స్పష్టతనూ పొందలేదు.

ఈ దశాబ్దంలో బాగా స్థిరపడిన మరొక ధోరణి మానవతావాదం. ఈ మార్గంలో ఉన్నంత మంచి కవులు మరే మార్గంలోనూలేరు. ఈ మార్గంలోనూ

అనేక శాఖలున్నాయి. ఈ మార్గంలో ప్రధాన కవులు సి. నారాయణరెడ్డిగారు, జె. బాపురెడ్డి గారు, నాయని కృష్ణకుమారి గారు, మాదిరాజు రంగారావు గారు, గోపి, గుమ్మనూరి రమేశ్ బాబు, సంజీవదేవ్, కె. కిషోరుబాబు, కె. అశోకుబాబు, పెన్నా శివరామకృష్ణ, బోయ జంగయ్య గారలు, దిలావర్, జిప్సీ ఇత్యాదులు.

ఈ మార్గంలోని సి. నారాయణరెడ్డి గారి వల్ల తెలుగు కవిత జాతీయ స్థాయిలో గుర్తింపు పొందింది. ఈ దశాబ్దంలోనే, విశ్వంభర ('80), నడక నా తల్లి ('84), కాలంఅంచుమీద ('85), రెక్కలు ('82), కవిత నా చిరునామా ('88), అన్న కావ్యాలు, సంపుటాలను సి. నా. రె. రాశారు. 'పెట్టెలు, ఆకాంక్ష, చీకటికి చితి, జోహారు, ఎప్పు డీ దుర్గంధ విమోచనం?, వీధి,' మొదలైన మంచి కవితలు కవిత నా చిరునామాలో ఉన్నాయి.

"ఊపిరాడని దేశంలో
ఉద్యమమే కదలిక —
నిత్యం నేను వెతుకుతున్నది
నిశ్శబ్దం ఒరలోని నిట్టూర్పు కత్తిని
నిజంగా నేను పితుకుతున్నది
నిజం పొదుగులోని నిరసనశక్తిని" అన్న పాదాలు చైతన్యాన్ని

కలిగించేవి. సి. నా. రె. 'కాలం అంచుమీద' సంపుటిలో

"మతం ఒక అభిమతమని
అది వ్యక్తిగతమని
అంతవరకే హితమనీ
ఆ హద్దు దాటితే ఖతమనీ"

ప్రబోధిస్తూ హెచ్చరిస్తారు. 'హితంలేని మతమెందుకు?' కూడా ఇలాంటి కవితే. మతం మీది ఈ ధోరణిని చాలామంది మానవతా కవులు కొనసాగించారు. మానవేతిహాసాన్ని కొత్త రీతిలో, తాత్త్వికంగా మలచిన కావ్యం 'విశ్వంభర.'

"మనస్సుకు తొడుగు మనిషి
మనిషికి ఉడుపు జగతి
ఇదే విశ్వంభరా తత్త్వం
ఇదే అనంత జీవిత సత్యం"

అన్న పాదాలతో ముగిసిన ఈ కావ్యం ఈ దశాబ్ది తెలుగు కవితకు తాత్త్విక భూమికను కల్గించింది.

ఇదే మార్గంలో మంచి కవిత్వం రాసిన వాళ్ళలో డా॥ గోపి ఒకరు.

'పావురా లెగరేస్తూ చంపేవాళ్ళను చూసి
కంగారుపడతావు' (బాధ సత్యం),

'మట్టెండలో కట్టెలమోపు లెత్తుకుని
మైళ్ళదూరం వెళ్ళేకాళ్ళు
నా గుండె మీంచి నడుస్తాయి'.

'పల్లెలు దాటి
పాతాళగంగలను సాధించిన కుండలు
నామాడును శిలాతలంగా మారుస్తాయి.'

(రక్తారోహణ) లాంటి పాదాలు గోపిగారి ధోరణిని స్పష్టీకరిస్తాయి. ఈ మార్గంలో రాస్తున్న కవుల్లో ఇస్మాయిల్, చందన్ రావు, కందాళై, గన్నుకృష్ణమూర్తి, మాదిరాజు రంగారావు ఇత్యాదులున్నారు. [వీళ్ళ కావ్యాల మీద ఈ వ్యాసకర్త "కొందరు మానవతా కవులు ఒక పరిశీలన" అన్న గ్రంథం రాశాడు] మాదిరాజు రంగారావుగారు ప్రజాస్వామ్య సోషలిజాన్ని నమ్ముతూ, స్వేచ్ఛకోసం పరితపిస్తూ హింసను తీవ్రంగా నిరసిస్తూ మనిషిని ఆధ్యాత్మిక శిఖరాలకు చేర్చగలిగిన గొప్ప కావ్యాలను రాశారు. మానవీయం అన్న వీరి కావ్యం మానవతా వాదానికి మేనిఫెస్టో లాంటిది.

'ఉల్కలవలె ఎగిసి
పిడుగులవలె దొరలుతూ
ఏమంటున్నారు? హింసాయుధులు?'

ఆపైన అదే వస్తుందని శాంతి?!" అని హింసావాదులను ఎద్దేవా చేశారు రంగారావుగారు. వీరు ఈ దశాబ్దంలో 'ఈతరం స్వరచిత్రం; 'నాకు జ్ఞాపకం ఉంది', 'వర్తమానం స్క్రీన్‌పై' అన్న మంచి కావ్యాలను రాశారు మానవతా పూర్ణమైన కంఠధ్వనిలో.

"పాయలుగా భిన్న దేశ జాతిస్వరమూ
ఏ వ్యక్తి నీడనో
ఏ ఊరు సీమనో
ఆగిపోవు
యాత్రకాదు"

అన్నం రంగారావుగారి ఆశయం స్పష్టం. నెమలికొండ బాలకిషన్ రావుగారిది కూడా ఇదే మార్గం.

తత్త్వప్రధాన కవితలలో రెండు గొప్ప కావ్యాలు ఈ దశాబ్దంలో వచ్చాయి. తుమ్మపూడి కోటేశ్వరరావుగారి 'కుమార భారతి' (1981), ఆరాశ్వాసాల (కమలములు) పద్యకావ్యం. షణ్ముఖునిమీది కావ్యంకాబట్టి షడశ్వాసాలుగా ఈ కావ్యం రాశారు కవి.

సుప్రసన్నగారి 'శతాంకుర' (1987) ఈ మార్గంలోని మరో మంచి కావ్యం. వచన కవిత్వంలో తాత్త్విక విషయాలను చెలంగారి ['సుధ'] తర్వాత ఇంత రమణీయంగా, కవితా స్పృహతో రాసినవాళ్ళు లేరనే చెప్పవచ్చును. "ఈ శరీర సముద్రంలో ఈదుతున్నాను." "ప్రాణాల గూళ్ళలో వేంచేసియున్న పంచాయతనమూర్తి"

"మనస్సు కొండక్రింది పాదులో
దాచుకొన్న తాళంచెవి నెవరిస్తారు?

"అనంత చైతన్య పరిష్వంగం, ప్రశాంత విద్యుల్లహరీ ప్రవాహం" 'సృష్టి పసిబిడ్డయై కేరింతలాడుతున్నది' మొదలైన పాదాలు గూఢార్థంతో (Mystical) నిండినవి. మనం గర్వించదగిన కావ్యం 'శతాంకుర' ఈ దశాబ్దంలో విలక్షణమైనది.

ఇక ఈ దశాబ్దంలో వచ్చిన మార్క్సిస్టు కవిత్వం. ఈ పంథాలోకూడా అనేకులు కవితలను రాశారు. గుంటూరు శేషేంద్రశర్మ, సి. వి. కృష్ణారావు, నిఖిలేశ్వర్, శివారెడ్డి, సిధారెడ్డి, నాళేశ్వరం శంకర్, సోమసుందర్, ఆరుద్ర, వరవరరావు, విమల, నమ్మి, సుగమ్‌బాబు, విజయసారథి, జయధీర్ తిరుమల రావు, గుడిహాళం, అఫ్సర్, అమ్మంగి, త్రిపురనేని శ్రీనివాస్–ఇత్యాదు లెందరో మార్క్సిస్ట్ దృక్కోణంతో కవితలు రాశారు. గత దశాబ్దానికే, ఈ శాఖలోని కవిత్వాభివ్యక్తిలో చెప్పుకోదగిన మార్పు వచ్చింది. నినాదాల స్థాయినుంచి ఆకర్షకమైన సుందరమైన అభివ్యక్తిని సాధించా రీ కవుల్లో కొందరు. [కొన్ని నినాదాలుకూడా రమణీయంగా ఉండడం చెప్పుకోదగిన విషయం!] గత దశాబ్దంలో పుంఖాను పుంఖంగా కవిత్వం రాసిన శేషేంద్రశర్మ ప్రభావం వీరిలో కొందరిపై పడడం గమనార్హం. శ్రీనివాస్ గారి రహస్యోద్యమం ఇందుకు మంచి ఉదాహరణ. ప్రతి మార్క్సిస్ట్‌కవీ ఆలోచించాల్సిన ఈ కింది శ్రీనివాస్‌గారి పాదాలను గమనించండి.

"కాగితం మీంచి కన్నులోకి వెన్నులోకి గన్నులోకి
దూసుకుపోయే కవిత్వం రాయి"—

"కవిత్వం వేరు వచనంవేరు
సాదాసీదా డీలా వాక్యం రాసి కవిత్వమని బుకాయించకు
కవిత్వాన్ని వంచించకు
వచనమై తేలిపోతావ్" -

"ఫుట్‌నోట్సులు ఉన్నది కవిత్వం కాదు
అక్షరానికి అక్షరమే వివరణ, అధోజ్ఞాపిక లెందుకు
చివరాఖర్న బ్రాకెట్లు పెట్టేది కవిత్వం కాదు
స్వానుభూతికీ సహానుభూతే సహజానుభూతి కుండలీకరణా లెందుకు?"—

"కవిత్వాన్ని వంచించకు
వచనమై పుడతావ్"— వీటన్నిటినీ అనుసరిస్తున్న మార్క్సిస్ట్ కవుల కొత్తతరం ఇప్పుడిప్పుడే నిలదొక్కు కుంటున్నది—

"అక్షరానికి పాలు తాపి పదం చేయాలి
పదానికి అన్నంపెట్టి వాక్యం చేయాలి
వాక్యానికి శిక్షణ ఇచ్చి కవిత్వం చేయాలి
కవిత్వానికి జీవితాన్నిచ్చి ఆయుధం చేయాలి."

అన్న శ్రీనివాస్ శిల్పదృష్టి ప్రశంసార్హం. కవిత్వం భాషయొక్క హృదయం తెలిసిన మంచి రౌతు శ్రీనివాస్. కవిత్వభాషయొక్క ఆత్మ తెలిసిన శ్రీనివాస్

"అందరికీ అర్థంకాని భాషకోసం అన్వేషిస్తున్నాను
ముఖ్యంగా శవాలకు
రేపు నేను రాయబోయే కవితలో శిల్పం ఒక్కటే జిగేలుమంటుంది.
శిల్పానికి తనదైన భాష ఉన్నదని నే నెవరికీ చెప్పను"—

అని అన్న శ్రీనివాస్ మంచిదారి చూపినట్లే. ఏ వస్తువును చూసినా వీరి రచనల్లో అనుభూతి కొల్లలుగా పొంగుతుండడం పాఠకుడు గమనిస్తాడు. ఇంకా ఈ ధోరణిలో చెప్పుకోదగిన పరిపక్వస్థాయిలో కవితలు రాసిన వాళ్ళల్లో శివారెడ్డి, అద్దేపల్లి, విమల, వరవరరావు, అఫ్సర్, ఛాయరాజ్, విమల గారలు ముఖ్యులు.

నక్సలైట్లది హింసకాదు; ప్రతిహింస - అని సాధారణంగా చెప్పబడ్తున్న మాటల్ని శివారెడ్డిగారు "గాయపర్చిన వాడు గాయపడి మరణించట మొక్కటే గాయానికి మందు" అని తమ 'మోహనా! ఓ మోహనా!' అన్న కావ్యంలో కవిత్వీకరించారు. వర్గ సమాజం యొక్క నైజాన్ని అచ్చమైన మార్క్సిస్టు" పంథాలో చిత్రిస్తూ వీరు "దేశ మేదైతే నేమిటి - జనదుఃఖ మంతా ఒక్కటే".

"ఒక సరుకు కింద మనిషిని మార్చిన స్థితిలో మానవతా విలువల
పరిరక్ష ణేమిటి
మానవ సంస్కారాన్ని పెంచే సంస్కరణల సాంబ్రాణి ధూప మేమిటి?"

వంటి పాదాలను రాశారు.

అద్దేపల్లివారి 'రక్తసంధ్య' మరో చెప్పుకోదగిన మార్క్సిస్టు కవితల సంపుటి. 'బతుకు పోరాటమే నా జెండా' అన్న కవిత ఇందులో ఎంతో విలువైనది.

"నీకు కవిత్వం నువ్వు తొడుక్కునే ఆభరణం
నీ నెత్తిమీది కిరీటం
నాకు కవిత్వం నేను పీల్చే ఊపిరి
నా బ్రతుకులోంచి పోరాటం"

అన్న వీరి పాదాలు చక్కగా కవిత్వ ప్రయోజనాన్ని, ఉద్యమ కవిత్వపు గొప్పదనాన్నీ తెల్పుతాయి.

"హృదయం లేని ఆయుధాలు
హృదయం పెరిగితే కరిగిపోక తప్పదు"

అన్న సదాశయంతో వీరి కవిత ఈ దశాబ్ది మార్క్సిస్ట్ కవితను పుష్టిమంతం చేసింది.

వరవరరావుగారి 'ఉన్నదేదో ఉన్నట్లు...' కవిత ఈ పంథాలోని మంచి కవిత.

"ఉలికి పడకు ఉక్తివైచిత్రీ
ఉన్నదేదో ఉన్నట్లు
హృదయానికి హత్తుకునేట్లు చెబ్తూ!"

అని అంటున్న వరవర్ ఈ కవితలో ఎంతో ఉక్తి వైచిత్ర్యాన్ని తెలీకుండానే చూపాడు! స్వభావతః కవి అయినవాడికి కవితా చైతన్యం చంపినా చావదు!

"నెత్తురంటిన చేతుల్ని గురించి
నెత్తీ నోరూ బాదుకొని మొత్తుకోవాలి తప్ప
కొత్త కాగితం వాసనో, అచ్చు వాసనో వేసే
అస్పష్ట కవిత్వం పక్కన
నీ ఫోటో తప్ప నిర్దిష్టంగా పోల్చుకునే దేమీ వుండదు"

ఇవన్నీ ఉక్తి వైచిత్ర్యం లేని మాటలా?

"శిలలో జీవం పోయడం కానీ
ఉలిపని
జీవితాన్ని శిల్పంగా చెక్కడం కాదు"

వంటి పాదాల ఆకర్షణ అందులోని ఉక్తి వైచిత్ర్యమే. ఈ మార్గంలో అఫ్సర్ కూడా మంచి కవిత్వం రాశారు.

"విత్తనం వెయ్యకుండానే
ఎరువులు చల్లుకుంటున్న మూర్ఖత్వంలోకి జారుకు పోతున్నప్పుడు
ఏదో ఒక దిష్టిబొమ్మ (దేవుడు) కావాలి"

"విష్ణుమూర్తి బొడ్డులోంచి పుట్టినా
చెదిరిన ఎర్రెర్రని వూహల "స్క్వేర్"లో పుట్టినా
దేవుడు - ఎక్కడైనా దేవుడే!
పదేపదే వల్లించడానికే
పూజిస్తూ కూర్చోడానికే
తారకమంత్ర మైతేనేం
కాపిటల్ అయితేనేం!"

అని మార్క్సిస్ట్ ఆచరణను ప్రబోధిస్తూ అఫ్సర్ రాశారు. ఆరుద్ర కూడా ఇలాంటి భావంతోనే 'పొయెటిక్స్ పొలిటిక్స్' అన్న కవితలో

"ఉత్తుత్తి కవితలకు టాటా
ఉత్తేజకరమైన భావికి బాట
ప్రజాకవితకే వుంటుంది సజావైన ప్రయోజనం
మజాకవితకు నిజానికి గమ్యం ఎడం ఒక యోజనం"

అని రాశారు.

ఈ మార్గంలో వచ్చిన కవితల్లో గుంటూరి శేషేంద్రశర్మ గారి 'అరుస్తున్న ఆద్మీ' (ఆధునిక మహాభారతము కావ్యంలోని ఆద్మీ పర్వం) మకుటాయమానమైంది.

"అగ్నిజ్వాలని ఆర్పగలవేమో గానీ
ఎర్రగులాబీ బ్రద్దలై ప్రవహిస్తున్న
రక్తవర్ణలావాని మాత్రం ఆర్పలేవు.'

"నీ ఫ్యాక్టరీ చిమ్నీలు భూగోళం మీద
మా విజయ స్తంభాలయ్యే దెప్పుడు ?
పనిచేసే చేతుల్లో పద్మాలు పూచేదెప్పుడు ? (ఆద్మీ కలలు)

"బూర్జువా దేశాల ఆకాశాల్ని బద్దలు కొట్టే దెప్పుడు ?"

"ఈ దేశం మాకు గాయాలిచ్చినా నీకు
మేము పువ్వు లిస్తున్నాం"

"అమ్మా ! నీవు ఏ భూమిమీద చీపురుతో
తుడుస్తున్నావో
ఆ వీపు మీద ఒక దేశం ఉందని నీకు తెలీదు."

వంటి కవితామయమైన పాదాలు అసంఖ్యాకంగా ఈ కావ్యంలో ఉన్నాయి. అలంకారాన్ని ఎలా అధునిక కవిత్వంలో వాడవచ్చునో, ప్రతీకతో ఎంత లోతుని సాధించి పెట్టవచ్చునో వీరి కవిత్వం చూపుతుంది. ఎందరి మీదనో ప్రభావాన్ని వేసిన గొప్ప కవి శేషేంద్ర శర్మగారు.

ఆత్మాశ్రయపరంగా మానవతావాద కవిత్వాన్ని వ్రాస్తున్న మంచి కవయిత్రి నాయని కృష్ణకుమారి గారు. ఆత్మీయత, కథాశిల్పం, సున్నితమైన కవితా శిల్పం వారి కవితకు సహజ గుణాలు. 'ఏం చెప్పను నేస్తం' (1988) ఉత్తమ కవితా సంకలనం. జె. బాపురెడ్డి గారు సదా ప్రతిభాశీలి. వారీదశాబ్దంలో వచన కవితలు, గేయాలూ వ్రాశారు. అంతర్జాతీయ కవి సమ్మేళనాల్లో తెలుగు కవితను, ఇంగ్లీషు కవితనూ వినిపించి ఉభయకవి మిత్రులయ్యారు. వారి కవితా సంపుటాలు ఒక్కొక్కటీ చాల ఫ్రెష్‌గా ఉంటాయి. డెబ్బైయేళ్ళ తరువాత కొత్త బాణీలలో కవిత్వం వ్రాస్తున్న బెజవాడ గోపాలరెడ్డి గారు వేదికమీద నిలబడి ఇంకా కవితలో మాట్లాడుతూనే ఉన్నారు. వీరందరిలో అభ్యుదయ భావాలు ఆత్మాశ్రయ ధోరణిలో వెలువడ్డాయి.

ఆత్మకథాత్మకమైన రచన 'నడిచి వచ్చిన దారి' మొదలయిన శీర్షికలతో తంగిరాల వెంకటసుబ్బారావు గారు రాస్తున్నారు. ఇంకా ముగియలే దీ కావ్యం. కుందుర్తి రాసిన 'హంస ఎగిరిపోయింది' స్మృతి కావ్యం.

మొత్తం మీద ఈ ఎనిమిదవ దశకంలో తెలుగు కవిత గుణాత్మకంగా చాలా సాధించింది. ఐతే దీన్ని వివరించడం కేవలం ఈ సమీక్షా వ్యాసంలో సాధ్యం కాదు. నిశ్శబ్దం గమ్యం (ఇంద్రగంటి శ్రీకాంతశర్మ), నిశ్శబ్దం నా మాతృక (పెన్నా శివరామకృ), నేత్రం నా సంకేతం (సుమనశ్రీ), సందిగ్ధ సంధ్య (కొండేపూడి నిర్మల), ఊళ్ళు ఉరుకుతున్నాయి. మోదుగుపూలు (బి. రాములు), శక్తిధార (గింజల నరసింహారెడ్డి), భారమితి (శివారెడ్డి), గీతంపునీత మౌతుంది (సుమనశ్రీ), కిర్మీరం జీవనబింబం (మాదిరాజు), వెలుతురు (బోయజంగయ్య), రక్తస్పర్శ (అఫ్సర్) కృత్యాద్యవస్థ (సౌభాగ్య), నాఉదయం (నాగభైరవ కోటేశ్వరరావు), కౌవ్వాత్తి (తిరునగరి), శిలలపొదలు (ఆచార్య తిరుమల), అక్షరాలు నా ఆనవాళ్ళు, ప్రకృతి నేపథ్యంలో (ఎ. మల్లేశ్వర రావు), అర్ధరాత్రి అరుణోదయం (శిరీష), హంస ఎగిరిపోయింది (కుందుర్తి) ఇత్యాది కవితా సంకలనాలు ఈ దశాబ్దంలో వచ్చాయి. హంస ఎగిరిపోయింది, ఆధునిక మహాభారతము (శేషేంద్ర) కావ్యాల మీద లోతైన పరిశీలన చేయాల్సి ఉన్నది. నిశ్శబ్దం నామాతృక, వెలుతురు, సందిగ్ధ సంధ్య, నేత్రం నాసంకేతం, రహస్యోద్యమం రక్తస్పర్శ అన్న సంకలనాలు ఈ దశాబ్దిలోని గొప్ప కావ్యాలుగా ఈ వ్యాసకర్త భావిస్తున్నాడు. జ్ఞానపీఠ బహుమతితో పాటుగా ఈ దశాబ్దంలో తెలుగు కవిత మానవతా దృక్కోణాన్ని, ఉత్తమస్థాయి తాత్వికతనూ, స్త్రీ వాదాన్నీ, శిల్ప ప్రాధాన్య దృష్టినీ సాధించింది. కవిత్వాభివ్యక్తిలో రాజీ పడక పోవడం ఈ దశాబ్దంలో విశేషంగా కనిపిస్తుంది. అత్యంతాధునిక వస్తువును కూడా నవ్యేతిహాసాలుగా మలచటం ఈ దశాబ్ది ప్రత్యేకత. ఈ సాహిత్య సంస్కారం వచ్చే దశాబ్దిలో ఏ కొత్తరీతులకు కారణం అవుతుందో వేచిచూడాల్సి ఉంది.

# ఈ దశాబ్దంలో తెలుగు నవల

—డాక్టర్ కాత్యాయనీ విద్మహే

పదేళ్ళ కాలం మీద వచ్చిన నవలలను పరిశీలించటం - అటు అనేక దిన వార మాస పత్రికల్లో సీరియల్సు గానూ, ఇటు సరాసరి రచనలుగానూ నవలలు అనేకం నిత్య పఠనానికి అందివస్తున్న సమకాలంలో - అంత సులభమైన పని కాదు. అయితే పఠనపాఠనాదుల వల్ల నవలా సాహిత్య ప్రక్రియతో వున్న పరిచయ గాఢతను బట్టి 1980 నుండి 1990 వరకు పదేళ్ళ కాలం మీద నవల రూపంలోనూ, సారంలోనూ పొడచూపిన ప్రధాన ధోరణులను ప్రస్తావించే ప్రయత్నం ఈ వ్యాసంలో జరుగుతుంది.

సమగ్ర మానవ జీవిత చిత్రణ చేసే ఆధునికేతిహాస మన్న చైతన్యంతో విస్తృతమైన జీవితాన్ని స్థూలంగానూ, సూక్ష్మంగానూ కూడా చూపించే విధంగా నవల రూప నిర్మాణ విషయంలో రెండు పద్ధతులు చోటు చేసుకోవటం ఈ దశాబ్ది నవలలో కనబడుతుంది. ఒకటి ప్రదర్శనకు సంబంధించినదైతే మరొకటి వినుకలికి సంబంధించింది. డాక్యుమెంటరీ పద్ధతి మొదటిదైతే మౌఖిక కథన ధోరణి రెండవది. సాంకేతికంగా అభివృద్ధి చెందిన సినిమా రంగం నుండి నవలా సాహిత్యంలోకి అనువర్తింపచేసుకొన్న పద్ధతి డాక్యుమెంటరీ పద్ధతి. జానపద కళా సమూహం నుండి నవలా సాహిత్యంలోకి వాడుకోవటానికి తెచ్చుకొన్న పద్ధతి మౌఖిక కథన ధోరణి. సామాజిక జీవిత చిత్రణా పత్రంగా కె. చిరంజీవి రాసిన 'బోలో స్వతంత్ర భారత్‌కి జై'[1] అన్న నవల డాక్యుమెంటరీ పద్ధతిని అనుసరించింది. 1947 ఆగస్టు 15 నుండి ప్రారంభించి 1983 ఆగస్టు 18 వరకు 36 సంవత్సరాల కాలం మీద భారతదేశ ఆర్థిక, రాజకీయ పరిణామాలను, వ్యక్తుల జీవితాలను, ఆ జీవితాలలో చోటు చేసుకొంటున్న మార్పులను వేరు వేరు కోణాల నుండి ఫొటోలు తీసి - భారతీయ సమాజం యొక్క

అసలు తత్వాన్ని పాఠకుల అవగాహనకు అందివ్వాలన్న తపనతో - ఒక క్రమ పద్ధతిలో అమర్చి అందించటంద్వారా అది డాక్యుమెంటరీ నవల అయింది. మౌఖిక కథనధోరణిని అనుసరించిన నవల అగ్నికణం.[2] విప్లవోద్యమాన్ని, సాహిత్యాన్ని ప్రజలకు సన్నిహితం చేయడానికి నవలలోని లిఖిత సాహిత్య స్వభావాన్ని తగ్గిస్తూ ఆ మేరకు దానిని మౌఖిక సంప్రదాయానికి దగ్గరగా చేయటమే మార్గమని నమ్మి రచనలు చేసిన అల్లం రాజయ్య లిఖిత సాహిత్య ప్రక్రియ అయిన నవల చట్రంలోకి మౌఖిక కథనప్రక్రియా ధోరణిని తీసుకొచ్చి యిమిడ్చాడు. అందువల్ల అగ్నికణం ఒకే సమయంలో రైతాంగ పోరాట చైతన్యాన్ని ప్రతిఫలిస్తూనే అందులో భాగంగా భూస్వామ్యవ్యవస్థలో రకరకాల అణచివేతలకు, ముఖ్యంగా లైంగిక దోపిడీకి గురి అవుతున్న బయ్యక్క అనే పేరుగల స్త్రీ జీవితచరిత్రను ఆమె మాటల్లోనే ఆమె దృక్పథం నుండి వినిపించే కథన ప్రక్రియ కూడా అవుతున్నది.

సీరియల్స్‌గా నవలలను ప్రచురించటం చాలా కాలం నుంచే వున్నా నవల రూపాన్ని ప్రభావితం చేయటంలో వాటిపాత్ర ఈ దశాబ్దిలో చెప్పుకోతగింది. ఉత్కంఠను ప్రాణభూతాంశంగా చేసి వచ్చేవారం వరకూ ప్రాణా లుగ్గబట్టుకొని ఆ తరువాత కథ ఏమైందో నని పాఠకులను ఎదురుచూసేట్లు చేయటంగా నవల కొత్త రూపాన్ని తీసుకోవటం 'తులసిదళం'[3] నవలతో ప్రారంభమైంది. రాజశేఖర చరిత్రలాంటి ప్రారంభ నవలలో రచయితలు ఇతివృత్త గమనంలో జోక్యం చేసుకొంటూ వివరణలు చేయటమో, సందేశాలందించటమో చేస్తే మళ్ళీ తులసిదళం లాంటి ఈదశాబ్ది నవలల్లో రచయితలు ప్రవేశించి క్షుద్రశక్తుల గురించి ఉదాహరణలతో వివరించటం దగ్గర నుండి ఎవరెవరు ఎప్పుడెప్పుడు ఏయే వ్యాపారాలు చేసి పైకి వచ్చారో చెప్పటం[4] దాకా అనేక విషయాల మీద మాట్లాడటం మొదలు పెట్టారు. జీవిత కథాపరిణామాలతో నిమిత్తం లేకుండా కేవలం కొన్ని సన్నివేశాలను వరుసగా కూర్చుకొంటూ పోవటం - పదిమంది ఒక చోట చేరి తలా ఒక జోకు ఒకళ్ళ తరువాత ఒకళ్ళు చెప్పుకొంటూ పోయారని రాసుకుపోవటాన్ని కూడా రూపంలో నవల అనే అన్నారు. పత్రికా సంపాదకులు నవలారూప నిర్ణయంలో రచయితలకు మార్గ నిర్దేశం చేసే

వాళ్ళుకావటం, రచయితలు ఎవరి జీవితాలను గురించి రాయాలను కొంటారో వాళ్ళను స్వయంగా కలిసి ఇంటర్వ్యూలు చేసి రాయటం వాళ్ళ ఫోటోలను తదితర వివరాలను కూడా నవలలో భాగంగా ప్రచురించటం, నవలలో పాత్రలకు నవల చదివే పాఠకులకు మధ్య దూరం చెరిపేసి పాఠకులు పాత్రలను తమలోకి ఆవాహన చేసుకునే ధోరణిని పెంచటంలో భాగంగా పత్రికలు ఫలానా సీరియల్‌లోని ఫలానా పాత్రనీవే అయితే ఏంచేస్తావ్ లాంటి శీర్షికలు నిర్వహించటం-ఇవన్నీ నవల రూపంలో విభ్రమాన్ని కలిగించే ఈ దశాబ్ది పరిణామాలు.

నవల రూపం విషయం ఇట్లా వుండగా సారం విషయంలో ఈ దశాబ్ది నవలల్లో ప్రధానంగా మూడుధోరణులను గుర్తించి చర్చించవచ్చు. సామాజిక జీవితాన్ని ఉద్యమాల్ని ప్రతిఫలించే ధోరణి మొదటిది. ప్రత్యేకించి స్త్రీల జీవిత విషయాలను చర్చించే ధోరణి రెండవది. సమాజ జీవితంతో సంబంధం లేకుండా రచయితల మెదళ్ళనుండి ఊడిపడ్డ వ్యక్తివాదధోరణి మూడవది.

1980 వ దశకం తెలుగు సమాజం గొప్ప పరిణామాలకు లోనైన కాలం. భారతదేశ రాజకీయాలలో రాజీవుగాంధీయుగం ప్రారంభమైతే, ఆ తరువాత కొద్దిరోజులకే ఆంధ్రదేశంలో ఎన్. టి. రామారావు రాజకీయరంగాన్ని కైవసం చేసుకొన్నాడు. డెబ్భైలల్లోనే స్పష్టమైన రూపం తీసుకొన్న ప్రజారాజకీయ ఉద్యమాలు, పౌరహక్కుల ఉద్యమాలు ఈ దశాబ్దిలో మరింత వేరూనుకొన్నాయి. వివిధస్థాయిలలో స్వేచ్ఛకోసం మెరుగైన బ్రతుకులకోసం ప్రజల ఆరాటాలు పోరాటాలు సాగాయి. కేంద్రంలోగానీ రాష్ట్రంలోగానీ ఉన్న ప్రభుత్వ మేమిటన్న ప్రశ్నతో నిమిత్తం లేకుండా ప్రజాఉద్యమాలను అణచివేయటంలో ఆప్రభుత్వాల పక్షాన పోలీసువ్యవస్థ జైళ్ళు తమ కర్తవ్యాన్ని నిర్వహించాయి. ఈ పరిణామాల ప్రతిఫలన రూపంగా వచ్చిన వాటిని సామాజిక ఉద్యమనవల లని పేర్కొనవచ్చు. సొమ్ములు పోనాయండి, ఊరు, ఖాకీవనం, కెప్టెన్ కథ, కొమురంభీం, అడవి, బతుకు, జైలు, నల్లవజ్రం, సింగరేణి మండుతోంది మొదలైన నవలలు ఈ ధోరణికి ప్రతినిధి నవలలు.

సంపన్న వర్గాల వారి భూమిని ఆనుకొనే చిన్నమడిచెక్క వున్న బక్క రైతు అప్పుల వలయంలో చిక్కి తన ఎడ్లను, ఆ మడిచెక్కను కూడా కోల్పోయి న్యాయం కోసం కోర్టుకి ఎక్కి, ఏమీ సాధించలేక పోగా తన కూతురి శీలం కూడా దోపిడి వ్యవస్థా స్వభావానికి బలి అయిపోతే తన కుటుంబాన్ని కూడా తనకు మిగల్చని ఆ అనుభవాల నుండి తిరగబడితే తప్ప బ్రతుకు లేదని, సాయుధుడైతే తప్ప తనకు దోపిడి పీడనల నుండి విముక్తి లేదని గ్రహించటం ఇతివృత్తంగా విశాఖజిల్లా మాండలికంలో వచ్చిన నవల 'సొమ్ములు పోనాయండి'.5 చట్టమూ, పోలీసు యంత్రాంగమూ, న్యాయ వ్యవస్థ అన్నీ ఉన్నవాళ్ళ ప్రయోజనాలను కాపాడటానికే పనిచేయటాన్ని, ఈ సమాజంలో లేనివాడు వీటన్నిటికి పరాయి వాడుగా మిగిలిపోతున్న దుస్థితిని చూపించి ఈ పరిస్థితి మారటానికి విప్లవం ఆవశ్యకమని నొక్కి చెప్తుంది నవల.

తెలంగాణా గ్రామీణ రైతాంగ పోరాటాన్ని ఇతివృత్తంగా చేసి అల్లం రాజయ్య రాసిన ఊరు నవల6 ఈ దశాబ్ది ప్రథమ పాదంలోది. ప్రజా చైతన్యం పదునుదేలి సంఘ నిర్మాణంలో భూస్వామ్య దోపిడి పీడనల నెదుర్కోటానికి పటిష్ఠమైన ప్రణాళికాబద్ధమైన ప్రజా ఉద్యమం రోజు రోజుకు బలపడుతుంటే, దానిని అణచివేయటానికి కొత్త వ్యూహాలతో పోలీసు బలగాలతో భూస్వాములు సన్నద్ధం అవుతున్నప్పుడు తెలంగాణాలో ముఖ్యంగా కల్లోలిత ప్రాంతాలైన సిరిసిల్లా, జగిత్యాల తాలూకాల ఊళ్ళు కొత్త పరిణామాలకు లోనవుతూ పోరాట పటిమను పెంచుకుంటున్న సామాజిక చారిత్రక వాస్తవాలను ప్రతిఫలించిన నవల ఊరు.

రావిశాస్త్రిని సాహితీ గురువుగా చెప్పుకొనే బీనాదేవి రాసిన కెప్టెన్‌కథ7 అన్న నవల కూడా విప్లవావశ్యకతను మరో కోణం నుండి నొక్కి చెప్తుంది. లంపెన్ ప్రోలెటేరియట్ విప్లవకరవర్గాలుగా మారాల్సిన అవసరాన్ని, మారటం సహజమూ అనివార్యమూ అయిన పరిస్థితిని ఈ నవల చిత్రిస్తుంది. ఇందులో కథ చెప్పే కెప్టెన్ రౌడీ నాయకుడు. దొంగతనాలు, జులుం చేస్తూ బ్రతికే ఈ కెప్టెన్ ఒక ఊరి పెత్తందారుకు బాడీగార్డుగా గ్రామంలోకి ప్రవేశించటం, ఆ గ్రామంలో పార్లమెంటరీ రాజకీయాలకు ప్రత్యక్షసాక్షిగా వుంటూ, ముఠా తగాదా

లలో కాలం గడుపుతూ క్రమంగా పేదల పక్షాన నిలబడి వాళ్ళకోసం పని చేస్తున్న డాక్టరు ప్రభావంలో ప్రజా రాజకీయ దృక్పథాన్ని అలవరచుకోవటం ఇందులో కథ. ఒక కులం వాళ్ళైనా, ఒకే వర్గం వాళ్ళయినా బంధుత్వాలున్నా అధికార కాంక్ష వాళ్ళను శత్రు శిబిరాలుగా ఎలా చీలుస్తుందో, తీరా పేదలంతా ఏకమై తమ హక్కులకోసం తిరగబడ్డప్పుడు వర్గ ప్రయోజనాలను కాపాడు కోవటం కోసం రెండు శిబిరాలుగా చీలిపోయిన వాళ్ళు మళ్ళీ ఎట్లా ఏకమవుతారో బుల్లిబాబు, బుచ్చిబాబుల మధ్య వైరుధ్యాలు, సంబంధాలు నిరూపిస్తాయి. న్యాయ స్థానాలు దొంగసాక్ష్యాల కూటాలుగా వుండి డబ్బున్నవాడికి న్యాయం చేసే అధికార యంత్రాంగంగా వుండటాన్ని కూడా ఈ నవలేతివృత్తం నిరూపిస్తుంది. ఇటువంటి వ్యవస్థను సమూలంగా మార్చుకోవటాన్ని గురించిన ప్రేరణ యివ్వటం అంతిమ లక్ష్యంగా 'కెప్టెన్ కథ' నవల ప్రవర్తిస్తుంది.

అధికారవర్గాల, సంపన్నవర్గాల శాంతిభద్రతల పరిరక్షణే లక్ష్యంగా కలిగిన పోలీసు వ్యవస్థకున్న ప్రజావ్యతిరేక స్వభావం ప్రజా ఉద్యమాలు అణచి వేయబడుతున్నప్పుడల్లా తీవ్ర విమర్శకు వ్యతిరేకతకు గురి అవుతునే వుంటుంది. అయితే ఈ సందర్భంలో పోలీసులను మొత్తంగా ప్రజావ్యతిరేకవర్గంగా పరిగ ణించాలా అన్నది ప్రధాన సమస్యగా ముందుకు వచ్చింది. పొట్టకూటికోసం పోలీసులై తమలాంటి బడుగుజీవులనే అదుపుచేయాల్సిన పరిస్థితులలో వున్న పోలీసులను ప్రజావ్యతిరేక వర్గంగా తీసిపారేయటం సమంజసం కాదేమోనన్న ఆలోచన నుండి లంపెన్ ప్రొలెటేరియట్‌ను విప్లవకర వర్గంగా మార్చుకో వాల్సిన అవసరమున్నట్లే పోలీసులనుకూడా విప్లవకరవర్గంగా మార్చుకోవాల్సిన అవసరం వుందని, అందువల్ల విప్లవం విజయవంతం కావటానికి అవకాశాలు కలిసివస్తాయన్న అవగాహన అభివృద్ధి చెందింది. ఈ అవగాహన నుండి పోలీసు వర్గాల జీవన సమస్యలను గుర్తించటం, చర్చించటం ప్రారంభమైంది. దీనికి సాహిత్య వ్యక్తీకరణగా 'ఖాకీవనం' నవల[8] వచ్చింది. పోలీసులు తమపై అధి కారుల బానిసలుగా బ్రతకాల్సివస్తున్న దుస్థితిని, ఇల్లు వాకిలీ పట్టకుండా డ్యూటీల మీద వెళ్తూ కుటుంబాల నుండి పరాయీకరణవల్ల పొందిన అసంతృప్త మానసికస్థితి నుండి చాలీచాలని జీతాలతో, అప్పులతో బ్రతుకులు వెళ్ళదీయాల్సిన

స్థితి నుండి దౌర్జన్యపరులుగా తయారుకావటాన్ని ఇతివృత్తంలో భాగం చేసిన ఈ నవల తమ బ్రతుకులు బాగుపడటానికి సంఘటితం కావటం సమ్మెకట్టటం తప్ప పోలీసులకు మరొక మార్గం లేదని సూచిస్తుంది.

'బతుకు' నవల[9] వరంగల్లును భూమికగా చేసుకుని రిక్షా కార్మికుల, గుడిసెవాసుల బడుగు బ్రతుకులలోని కష్టనష్టాలను కన్నీళ్ళను చిత్రించింది. పల్లెటూళ్ళలో బ్రతకలేక పట్టణాలకు చేరి ఏదో ఒక పని చేసుకొని బ్రతుకుదామను కొనే వాళ్ళు డబ్బు మదుపులు పెట్టే సర్దార్ల చేతుల్లోనూ, వాళ్ళ దాదాల చేతుల్లోనూ దిన దిన గండంగా జీవించాల్సిన పరిస్థితిని, సంపాదించినది కాస్తా అప్పు కింద జమపడి పోతూ వుంటే మిగిలిన కాస్తా పోలీసులనో, దాదాలనో సంతృప్తి పరచటానికి సర్దాల్సి వస్తుంటే, బతుకుమీద ఏ ఆశతో పట్నాలకు తరలి వచ్చారో ఆ ఆశలన్నీ పేకమేడలై కూలిపోతూ వుంటే, పల్లె అయినా పట్నమైనా పేదవాడి బ్రతుకును మార్చలేదని అర్థంచేసు కోవటాన్ని 'బతుకు నవల' బాగా ప్రతిఫలించింది.

1922 లో మాలపల్లి నవల బ్రిటిషు రాజ్యాంగ వ్యవస్థలో జైళ్ళు ఎంత నరక కూపాలుగా వున్నాయో చిత్రిస్తే అరవై అయిదు సంవత్సరాల తరువాత స్వతంత్ర భారతదేశంలో కూడా జైళ్ళ పరిస్థితి అంతకంటే ఏమీ మెరుగ్గా లేదని జైలు నవల[10] నిరూపించింది.

కొమురం భీం[11], అడవి[12] నవలలు ఆదిలాబాద్ జిల్లాలోతట్టు అడవులలో గిరిజనులు భూమిమీద స్వత్వాన్ని కోల్పోతూ మైదాన ప్రాంతాల వారి దోపిడికి, ప్రభుత్వాధికార చట్టాల జులుంకు బలి అవుతూ ఆ దుర్భర స్థితినుండి విముక్తికై ఉద్యమించటాన్ని వస్తువుగా చేసుకొని వచ్చాయి. ఈ రెండు నవలలకు ప్రేరణ 1981 ఏప్రిల్ 20 నాటి ఇంద్రవల్లి సంఘటనే. మొదటి నవల ఆ సంఘటనకు తక్షణ ప్రతిఫలన రూపం కాగా రెండవది నిదానంగా ఆ సంఘటన పూర్వాపరాలను విచారించుకొన్న దాని ఫలితం.కొమురం భీం చారిత్రక నవల. ఆ చారిత్రక ఘటనను గర్భీకరించుకొని గిరిజన రైతాంగం యొక్క ఆరాట పోరాటాలకు మూలమైన సామాజిక జీవిత రంగాన్ని చిత్రించి 1981 నాటి ఇంద్రవెల్లి సంఘటనకు దానిని ప్రాతిపదికగా చూపించిన సామాజిక నవల అడవి

తెలుగు నేలపై బొగ్గుగనులు ప్రారంభమై వంద సంవత్సరాలు అయినా బొగ్గు గనులలో జనజీవన సంఘర్షణ సాహిత్యానికి వస్తువు కావటం మాత్రం ప్రజా ఉద్యమాలు ఊపు నందుకొన్న తరువాత గానీ జరగలేదు. బొగ్గు బావి కార్మికుల సమస్యలను చిత్రిస్తూ కథలు రావటం 1978 నుండే ప్రారంభమైంది. కానీ నవల మాత్రం ఈ దశాబ్ది ఆవిష్కరణే. 'నల్లవజ్రం' నవల[13] అందులో తొలి ప్రయత్నం. తొలి ప్రయత్నమే అయినా బొగ్గు బావి కార్మికుల జీవితంలో, పని ప్రాంతాలలో భద్రత లేకపోవటం దగ్గర నుంచి మొదలుపెట్టి కార్మికులను బలహీనులను, రోగిష్టులను చేసే పనిపరిస్థితుల గురించి, కార్మికుల సంక్షేమాన్ని గురించి అసలే పట్టించుకోని లేబరాఫీసర్ల గురించి, కంపెనీ డాక్టర్ల గురించి అనేక విషయాలను ఇతివృత్తంలో భాగం చేసి శంకరయ్య లాంటి కార్మికులు వ్యక్తులుగా తమ సమస్యలకు పరిష్కారం సంఘటిత శక్తిగా సమకూడటం మీదనే వుందన్న చైతన్యాన్ని పెంచుకోవటాన్ని సమర్థవంతంగా చిత్రించింది. 'సింగరేణి మండుతోంది' అన్న నవల[14] కూడా బొగ్గుగని కార్మికుల జీవితం అడుగడుగునా దోపిడికి గురికావటాన్ని విస్తృతంగా ప్రదర్శించింది. కష్టజీవి పక్షంగా చట్టాలు సవరించబడితే, కష్టజీవి కార్యరంగంలో వుండి దేశాన్ని పునర్నిర్మిస్తే కార్మికుల జీవితంలో శుభం పూసి హితం జరుగుతుందన్న అవగాహన నివ్వటంగా ఈ నవలేతి వృత్తం నిర్వహించబడింది.

మొత్తంమీద ఈ నవలలన్నీ కూడా సమకాలీన మానవ సమాజంలో వున్న సాంఘిక ఆర్థిక అసమానతలను గుర్తించి మానవ సంబంధాల మీద వాటి దుష్ప్రభావాన్ని గుర్తించి ఉన్నత మానవీయ విలువలతో కూడుకొన్న నూతన సమాజ నిర్మాణానికి ఏదో ఒక రీతిలో తిరుగుబాట్లు, సామూహిక ఉద్యమాలు తప్పవన్న చైతన్య స్థాయిని కనబరిచాయి.

ఇంతకుముందెన్నడూ లేనంత విస్తృతంగానూ, లోతుగాను స్త్రీజన జీవన సమస్యలు ఈ దశాబ్ది నవలలకు వస్తువైనాయి. అంతర్జాతీయ మహిళా దశాబ్ది (1975-85) వల్ల ప్రపంచం మొత్తంమీద మహిళాజన జీవితం గురించి ఆలోచించటానికి కలిసివచ్చిన అవకాశాలు, విప్లవోద్యమాలు, పౌరహక్కుల ఉద్యమాలు విస్తరిస్తున్న కొద్దీ అభివృద్ధిచెందుతున్న చైతన్యం తరతరాలుగా

స్త్రీపురుషుల మధ్య కొనసాగి వస్తున్న అసమానతలను ప్రశ్నించే వాతావరణాన్ని కల్పించటం ఇందుకు కారణాలు. ఈ సామాజిక నేపథ్యం వల్లనే దశాబ్దిలో నవల కేవలం స్త్రీల జీవితాన్ని సంస్కరణదృష్టితో చూడటమో, లేక స్త్రీల జీవితాలలోని దైన్యాన్ని చూచి కన్నీళ్ళు కార్చటమో చేయక కుటుంబంలోనూ, భార్యాభర్తల సంబంధాలలోనూ, సామాజిక జీవితరంగాలలోనూ స్త్రీ స్థానాన్ని గురించి మౌలిక మైన ప్రశ్నలు లేవనెత్తింది. స్త్రీలకు తమ జీవితాల గురించిన విశ్లేషణాత్మక, విమర్శనాత్మక దృక్పథం అలవడటానికి ప్రేరకంగా పనిచేసింది. 'జానకి విముక్తి', స్వేచ్ఛ, 'మానవి' ఈ ధోరణికి ప్రతినిధి నవలలు.

ఈ దశాబ్ది మొదట్లో స్త్రీల జీవితాల గురించి కొత్త అవగాహనల నందించ టానికి ఉద్యమస్ఫూర్తితో వచ్చిన నవల జానకి విముక్తి.[15] భార్యాభర్తల సంబంధా లలో భార్యస్థానం-భర్త కోరిన కట్నకానుకలు పుట్టింటినుండి చేరవేస్తూ, భర్తకు అన్నం వండిపెట్టటం నుండి కాళ్ళుపిసకటం వరకు అన్ని సేవలు చేస్తూ, కోరి నప్పుడల్లా దేహాన్నిస్తూ, బుద్ధిని చైతన్యాన్ని కూడా అతని వశంచేసి తనకంటూ స్వతంత్రమైన ఆలోచన బ్రతుకు లేకుండా భర్త ఛీత్కారాలకు గురవుతూ కూడా అతనింటి గుమ్మం పట్టుకు వేళ్ళాడటంగా వున్న పరిస్థితిని చూపించి దుర్భరమైన ఈ జీవితం నుండి బయపడటానికి స్త్రీలు చైతన్యవంతులై పూను కోవాలని తమ సర్వశక్తులను అణచివేసే సంసారం నుండి బయటపడి స్వతంత్ర జీవనమార్గాన్ని ఎంచుకోవటం ద్వారానే స్త్రీకి విముక్తి సాధ్యమవుతుందని జానకి జీవితం ద్వారా నేర్చుకోమంటారు రంగనాయకమ్మ. 'స్త్రీల సమస్యలు స్త్రీల జీవితాలకే పరిమితం కాదు... స్త్రీ సమస్యల మీద స్త్రీలకు సరియైన జ్ఞానం కల గడం ఎంత అవసరమో, పురుషులకు సరైనజ్ఞానం కలగడం కూడా అంత అవసరమే'నన్న అవగాహన గల రంగనాయకమ్మ అట్లాంటి జ్ఞానాన్ని ప్రాపం చిక అనుభవాల నుండి చెల్లెలి జీవితం నుండి పొంది ఆ జ్ఞానకాంతులతో తన జీవి తాన్ని వెలిగించుకొన్న సత్యాన్ని ఈ నవలలో చిత్రించారు. భార్యాభర్తల సంబంధా లెంత బానిస యజమాని సంబంధాలుగా వున్నాయో విశ్లేషించి చూపి స్నేహం, సమానత ప్రాతిపదికలుగా సమస్థాయి సంబంధాలు నేర్పరచుకోవ టానికి స్త్రీపురుషులు ప్రయత్నపరులు కావాలని, వాళ్ళిద్దరి మధ్యా ఆ సమస్థాయి

సంబంధాలు కొనసాగాలంటే పురుషుడు పోషించేవాడుగా, స్త్రీ పోషింపబడేదిగా వుండకూడదని, ఆడపని మగపని అన్న విభజన లేకుండా ఇంటిపనిని స్త్రీపురుషులిద్దరూ సహజంగా చేసుకొంటూ పోయే వాతావరణాన్ని ఏర్పరచుకోవాలని ఈ నవల చెప్తుంది.

జానకి విముక్తి నవల కుటుంబంలోని వైరుధ్యాలను చర్చించి స్త్రీ జీవితాభివృద్ధికి ఆటంకంగా వున్న వ్యవస్థా స్వభావాన్ని మార్చుకొంటూ రావాల్సిన అవసరాన్ని చెపితే కుటుంబంలో తన బాధ్యతకు సామాజిక కార్యకలాపాలలో తన భాగస్వామ్యానికి మధ్య వైరుధ్యాలు వచ్చినప్పుడు స్త్రీపడే ఘర్షణను 'స్వేచ్ఛ' నవల[16] చిత్రించింది. భార్యగా, తల్లిగా భర్తను పిల్లల్ని చూసుకొంటూ ఇల్లు చక్కబెట్టుకోవటం కాక సామాజిక కార్యకలాపాలలో భాగస్వామి కావాలనుకొనే స్త్రీ ఆ పని భర్తకు ఇష్టం లేనిదైతే ఇక తన జీవితం మీద భర్త అదుపును ఎంతగా ఎదుర్కోవలసివస్తుందో, ఆర్థిక స్వాతంత్ర్యం వున్నా అంతకు మించి స్వతంత్రంగా ప్రవర్తించగల స్వేచ్ఛ కోసం స్త్రీ ఎంత సంఘర్షణకు గురికావలసి వస్తుందో అరుణ జీవితాన్ని కేంద్రంగా చేసి చూపుతుం దీ నవల. తా నొక స్వతంత్రవ్యక్తిగా సృజనాత్మక శక్తులతో బతకటానికి వీలైన సామాజిక జీవితం కోసం కుటుంబ జీవితాన్ని కాదని అరుణ బయటకు వస్తే 'మానవి' నవల[17] లో వసంత తా నిన్నాళ్ళు తనదని నమ్ముకొన్న కుటుంబం తనది కాకుండా పోయేసరికి దాన్ని వదలి క్రమంగా సామాజిక జీవన స్రవంతిలోకి వచ్చిచేరుతుంది. భర్త మరోస్త్రీతో సంబంధం ఏర్పరచుకోంటే ఆ తిరస్కృతిని భరించలేక ఆ కుటుంబం తనది కాకుండా పోయిందే నన్న వేదన వల్ల చచ్చిపోదామా అన్నంత నిస్పృహకు లోనై చిన్న కూతురు నవత సాహచర్యంలో సామాజిక విషయాలపట్ల ఆసక్తి పెంచుకొంటూ సామాజిక జీవితం తనను మనిషిగా నిలబెట్టటాన్ని అనుభవంలో గ్రహించి 'మానవి'గా ఎదుగుతుంది.

ఒకవైపు ఇట్లా స్త్రీని ఆత్మాభిమానంతో ప్రవర్తించే వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకొంటున్న మానవ వ్యక్తిగా నిరూపించే ప్రయత్నాలు జరుగుతుండగా మరొకవైపు స్త్రీని ఆత్మాభిమానం ప్రసక్తే లేకుండా అస్తిత్వంలో వున్న కుటుంబ వ్యవస్థతో రాజీపడి బ్రతికే దానిగా చిత్రిస్తూ నవలలు వచ్చాయి.

'ఆలోచించు' నవల[18] భర్తకు మరోస్త్రీతో సంబంధం ఏర్పడితే సమస్యను ఆ స్త్రీకోణంనుండి చూసి సానుభూతితో ఆలోచించి భర్తను, ఆ అమ్మాయినీ కూడా అర్థం చేసుకోవాలేగానీ స్త్రీ ఆవేశానికి లోనై కుటుంబ బంధాలను తెంచుకోవటం వివేకమైన పని కాదని చెప్తుంది. తిట్టి కొట్టి హింసించే వాడైన భర్తను వదిలేసి స్వతంత్రంగా బ్రతికిన నిర్మల తన అనుభవంలో అట్లా రావటం తప్పని గ్రహించి, అందువల్ల తాను తనదైన సంసారం లేకుండా చేసుకొన్నానని బాధపడుతూ, అట్లాంటి పొరపాటు చేయవద్దని కొత్తగా కాపురానికి వెళ్ళి వచ్చిన విద్యను హెచ్చరించటం ఇతివృత్తంగా కలిగిన నవల 'జీవితం చే జార నీయకు'.[19] సంసారం, పిల్లలు లేకపోతే స్త్రీ జీవితమంతా వృధాయే నన్న ఆలోచనతో అట్లాంటి స్త్రీ పుట్టింట అవమానాలకు గురిఅవుతూ అసంతృప్తికరమైన జీవితాన్ని జీవించాల్సి వస్తుందన్న దృక్పథాన్ని నిర్మల పెంచుకొని ఆ దృక్పథాన్నే విద్యకు కలిగించటంగా ఈ నవల సాగుతుంది. స్త్రీలు భర్తలని కావలసినట్లు మలచుకోవటమే ధ్యేయంగా కష్టమైనా, నష్టమైనా సంసారం చేస్తూ వుండాలని చెప్పటమే కాక అజ్ఞానంలో వున్నా పాతకాలపు స్త్రీల బ్రతుకులే భర్తా పిల్లల చాకిరీలతో హాయిగా గడిచిపోయా యని కొద్దిగానో గొప్పగానో తన జీవితం గురించి హక్కుల గురించి ఆలోచించటం ప్రారంభించిన స్త్రీ తన జీవిత గమనంలో ఎంతో సంఘర్షణను ఎదుర్కోవలసి వస్తుందని చెప్పే ఈ నవల ఇబ్బందులు, సంఘర్షణలు వుంటాయి గనుక మార్పుకోసం ప్రయత్నించవద్దని చెప్పకనే చెప్పి నట్లయింది. ఈ నవలా రచయితకు భర్తల దుర్మార్గానికి పితృస్వామిక సామాజిక ఆర్థిక వ్యవస్థకు వున్న సంబంధం అర్థంకాక పోవటం వల్ల, సంసారాన్ని వదిలేసిన స్త్రీకి ఆర్థిక స్వావలంబన వున్నా సామాజిక జీవిత చైతన్యం వుండాలన్న స్పృహ లేకపోవటం వల్ల నిర్మల పాత్ర అంత బలహీనంగా తయారై సాంసారిక జీవిత పీడనల మీద తిరగబడాలని చొరవచూపే స్త్రీల నైతిక ధైర్యాన్ని దిగజార్చేదిగా తయారైంది.

ఇవన్నీ మధ్య తరగతి స్త్రీల జీవిత సమస్యలను అభ్యుదయ దృక్పథంతోనో, తిరోగమన దృష్టితోనో చూచి రాసిన నవలలు. అట్టడుగు వర్గాల మహిళా జన జీవన సమస్యలను వస్తువుగా చేసుకొని అగ్నికణం, బతుకుపోరు అన్న

రెండు నవలలు వచ్చాయి. అటు అసమ సమాజంలోని ఆర్థిక పీడనకు, దానితో పాటు అదే సమయంలో ఇటు పితృ స్వామ్య సమాజ స్వభావంవల్ల లైంగిక పీడనకు గురి అవుతూ దుర్భరమైన బ్రతుకులు బ్రతుకుతూ, బ్రతుకు నిత్య సంఘర్షణగా జీవిస్తూ వున్న స్త్రీలకు ప్రతినిధిగా బయ్యక్కను తీసుకొని అగ్నికణం నవల రాశాడు అల్లం రాజయ్య. బయ్యక్కల్లాంటి స్త్రీల జీవితాలు పీడన నుండి, దోపిడి నుండి విముక్తి చెందాలంటే శ్రామిక రైతాంగ విముక్తి పోరాటాలల్లో మమేకం అయినప్పుడే సాధ్యమన్న అవగాహనకు దారులు తీస్తూ ఈ నవలేతివృత్తం సాగుతుంది. బీడీ మహిళా కార్మికుల జీవితాలను చుట్టుకొని ప్రవర్తించే బతుకుపోరు నవల ఇంటా బయటా కూడా పీడనకు గురయ్యే స్త్రీలు తమ జీవన విధానాలను మెరుగుపరుచుకోవటానికై సామాజిక ఉద్యమాలలో భాగస్వాములు కావల్సిన అవసరాన్ని స్పష్టం చేస్తుంది. జానకి విముక్తి నవల కూడా మధ్యతరగతి స్త్రీల జీవితంలో అభ్యుదయకరమైన మార్పు స్వంత చైతన్యాలను వికసింప చేసుకోవటంలోనే కాక ఆర్థిక అసమానతలకు వ్యతిరేకంగా సాగే ఉద్యమాలలో నిబద్ధతతో పనిచేస్తూ సమాజాన్ని మార్చుకొనే క్రమం మీద కూడా ఆధారపడి వుందన్న అవగాహన నందిస్తుంది.

డబ్బు చేసుకోవటమే ప్రధాన లక్ష్యంగా అందుకోసం మానవీయ విలువలనన్నింటినీ తాకట్టుపెట్టే విద్యా వైజ్ఞానిక విషయాల్లోనూ, సామాజిక ఆర్థిక సాంస్కృతిక అంశాలల్లోనూ వికసిస్తున్న నవచైతన్యాన్ని పెడమార్గం పట్టించటంగా కుహనా వైజ్ఞానిక, రాజకీయార్థిక స్త్రీ చైతన్యవాద నవలలు ఈ దశాబ్దిలో వచ్చాయి. ప్రేమ, అందుకు సంబంధించిన కాల్పనిక భావజాలం ప్రధానేతివృత్తంగా వుండే నవలలు కనుమరుగై ఈ దశాబ్దిలో నేరం, హింస, సెక్సు ప్రధానేతివృత్తంగా వుండే నవలలు వచ్చాయి. దానితో వ్యాపార నవలా రంగం స్త్రీల చేతులనుండి పురుషుల చేతుల్లోకి మారింది. సైన్స్ గొప్పదని చెప్తూనే హేతుబద్ధతకు ప్రాధాన్యత నిస్తున్నట్లే యిచ్చి, సైన్స్‌కు అందని శక్తులున్నాయని చేతబడికో, మరో క్షుద్ర విద్యకో పెద్ద పీట వేసే తులసిదళం, కాష్మోరా లాంటి నవలలు, వ్యక్తి ప్రతిభ తోటి, గిమ్మిక్కుల తోటి పోటీపడి, వ్యాపార రంగంలో అంచెలంచెలుగా ఎదిగినట్లు, చిత్రించటమే అర్థశాస్త్ర పాండిత్యమని మురిసిపోతూ

వచ్చిన త్రినేత్రుడు, స్టార్‌వార్స్ లాంటి నవలలు, మోడల్ స్త్రీలను, కాబెరా డాన్సర్లను కేంద్రంగా చేసి క్రైమ్, సస్పెన్స్, సెక్సుల సమ్మేళనంతో యథాశక్తి నవలలు రాయటమే స్త్రీల జీవితంలోని పీడన దోపిడులపట్ల బాధను వ్యతిరేకతనూ వ్యక్తం చేయటంగా వచ్చిన మోడల్,20 కాబరే డాన్సర్ లాంటి నవలలు ఈ దశాబ్దిలో వచ్చాయి. సమాజ జీవితంలో పెరిగిపోతున్న అసమానతలు, నిరుద్యోగం, అభద్రత కారణాలుగానో, పత్రికా రంగంలో పెరిగిపోతున్న పోటీ కారణంగానో, రోజుకొక కొత్త వస్తువును కొత్త లేబుల్‌తో కొత్త ప్రకటనలతో అందించటం మీద ఆధారపడిన పెట్టుబడిదారీ వ్యవస్థా సంస్కృతి కారణంగానో-జీవితం బయటినుండి వింత వింతలైన విచిత్రమైన అపూర్వమైన అంశాలను నవలకు వస్తువుగా ఎంచుకొని రావటంలో రచయితలు పోటా పోటీలు పడుతున్న పరిస్థితులలో స్మగ్లింగుల మీద, సర్కసుల మీదా, కారు డ్రైవింగుల మీదా, రైఫిల్ షూటింగుల మీదా, మరణ మృదంగం, సర్కస్ సర్కస్, డ్రైవర్ చైతన్య, అగ్నిశ్వాస లాంటి నవలలు వచ్చాయి ఈ దశాబ్దిలో. ఈ వాతావరణం ప్రేరకంగా పనిచేయటం వల్లనే నేమో గుంటూరు శేషేంద్ర శర్మ లాంటి కవులు కూడా నవలా రచనలోకి దిగారు.

రూపం దృష్ట్యా ఇవన్నీ నవలలుగా చలామణి అవుతున్నప్పటికీ సారం విషయానికి వస్తే మాత్రం ఇవన్నీ నవలలేనా అన్న సందేహం కలగక మానదు. సమకాలీన మానవ సమాజాన్ని చిత్రించటం నవల స్వభావం అవుతుండగా జన సమూహం మొత్తం మీద సంభవ యోగ్యత గల సంఘటనల అంశాల కూర్పుకు బదులుగా మన మెప్పుడూ చూడని అధోలోకాల స్వరూపాన్నో (మరణమృదంగం) ఏ కొద్దిమందో అయిన అత్యున్నత వర్గాల వారి జీవిత సరళినో - అందునా సెక్సు జీవితాన్ని - చిత్రించటంగా సాగే నవలలు స్వరూపంలో నవలలు కావచ్చు కానీ, స్వభావంలో కాలేవు స్వభావంలో నవలలు కాని వాటిని నవలలుగా చలామణిలోకి తీసుకు రావటానికే అవి గొప్ప పరిశోధనలు చేసి రాసినవనో, వాస్తవ వ్యక్తులు నవలల్లోని ఆ పాత్రల వెనక వున్నారనో చెప్పి నవలలోని కథ పట్ల మాత్రమే కాక నవలపట్ల కూడా ఉత్సుకతను, ఉత్కంఠను కలిగించే ధోరణి ఈ రకం నవలల్లో విరివిగా కనబడుతుంది.

ఈ ధోరణి నవలల్లో మొదట్లో తులసిదళం, తరువాత కామోత్సవ్, ఆ పైన తేనెటీగ తీవ్రమైన విమర్శకు గురి అయ్యాయి. వినియోగదారుల ఉద్యమాలు నవలా సాహిత్య రంగంలో కూడా ప్రారంభమయ్యాయి. చదివే పాఠకులు అది తమకు హాని కలిగించే రచన అయితే దానిని తాము సలు వినియోగించమని చెప్తూ, దానిని వినియోగంలోకి రాకుండా చూడాల్సిందిగా పత్రికలను, న్యాయ వ్యవస్థను కోరటం జరుగుతున్నది. తులసిదళం నవలను వ్యక్తిగా రంగ నాయకమ్మ ఒక్కరే ఎదుర్కొని అందులో ప్రజలకు హాని చేసే అంశాలెన్ని వున్నాయో విశ్లేషించి రాసి, ఫలితంగా పరువునష్టం దావాను ఎదుర్కొన్నారు. కామోత్సవ్ నవల అసభ్య శృంగారాన్ని వస్తువుగా కలిగివుందని ఆ నవలను విమర్శిస్తూ వ్యతిరేకిస్తూ గాంధీ స్మారక సమితి, ప్రజాసాహితి లాంటి సంస్థలు అశ్లీల వ్యతిరేక కమిటీలు, విద్యార్థి సంఘాలు - తీర్మానాలు చేస్తూ పత్రికల్లో రాశాయి. తేనెటీగ సీరియల్ ఆపెయ్యాల్సిందిగా డిమాండు చేస్తూ వివిధ సంస్థలీ పనే చేశాయి.[21] గాంధీ స్మారక సమితివారు కామోత్సవ్ నవలపై క్రిమినల్ కేసు కూడా వేశారు.[22] ప్రజా ఉద్యమాలు పదునెక్కుతూ తమకు విహిత మేదో, కాని దేదో తెలుసుకొనే చైతన్యాన్ని పెంచుకొంటున్న ప్రజలు మంచి సాహిత్యం చదవటానికి తమ కున్న హక్కు కాలరాచి వేయబడుతూ తమ మేధోవికాసాన్ని అభివృద్ధిని అదుపుచేసే శక్తిగా సాహిత్యం మారుతుంటే దానిని వ్యతిరేకించటం సహజమే. ప్రజలపట్ల బాధ్యతతో వాళ్ళపక్షాన నిలబడి ఆనాడు రంగనాయకమ్మ అయినా ఈనాడు నైతిక విప్లవం తదితర పత్రికల సంపాదకులైనా ఆ సహజమైన పనే చేశారు. అయితే ఈ చర్య తమ పరువును దిగజార్చిందని రచయితలు వాపోయారు. భిన్న జీవిత దృక్పథాలున్న సామాజిక వ్యవస్థతో భావాలు సంఘర్షించటం, అభిప్రాయాలు భేదించటం సహజం. సాహిత్యంలోనూ ఈ భిన్న దృక్పథాల కారణంగా రచయితలు ఒకళ్ళనొకళ్ళు తీవ్రంగా విమర్శించుకొంటూ పత్రికలలో వ్యాసాలు రాయటం ద్వారా యుద్ధాలుచేయటం ఇంతకు ముందు వుంది. ఆ కనీస ప్రజాస్వామిక స్వభావాన్ని కోల్పోయి, సంఘర్షించే భావాల ద్వారా ఆలోచనల వికాసానికి చేయగల దోహదాన్ని మరిచిపోయి రచయితలు తమ మీద వచ్చిన విమర్శల నెదుర్కోవటానికి కోర్టుల నాశ్రయించారు. ఆ రకంగా నవలను కోర్టు కెక్కించిన ఘనత ఈ దశాబ్దిదే.

ఆయా నవలల్లో విషయాలు ప్రజలకు హానిచేసేవిగా వాళ్ళ చైతన్యాన్ని పెడదారులు పట్టించేవిగా వున్నాయని విమర్శిస్తే నిరసిస్తే రచయితలు అది తమ భావప్రకటనా స్వేచ్ఛపై నిఘాగా వుందని ఆగ్రహపడ్డారు.[23] నవల పేరుమీద ఏదిబడితే అది రాయటానికి తమకు స్వేచ్ఛవుండాలి కానీ వాటిని స్వీకరించాల్సిన పాఠకులకు మాత్రం వాటిని విమర్శించే స్వేచ్ఛ వుండకూడ దనటం - తా మేది రాసినా దానిని ప్రశ్నించకుండా పాఠకులు స్వీకరించాలనుకోవటం, విమర్శనుండి తా మేదీ నేర్చుకోవటానికి సిద్ధంగా లేక పోవటం - ఇవన్నీ నవలా రచయితలు సమాజంనుండి ప్రజలనుండి ఎంత దూరంగా వుండాలనుకొంటున్నారో స్పష్టంగా చూపిస్తున్నాయి.

గత పదేళ్ళ నవలా ప్రక్రియచరిత్రలో అభివృద్ధికరమైనవి, అభినందించ దగినవి అయిన పరిణామాల నెంతగా పొందిందో, బాధపడాల్సిన, నిరసించాల్సిన వైరితలల నంతంగా వేసింది కూడా. చరిత్ర నుంచి గుణపాఠాలు నేర్చుకొంటూ రచయితలు ఎదగటానికి సిద్ధంగా వున్నారా లేదా అన్నది ఈనాడు మనముందున్న ప్రశ్న. ఈ పరిస్థితులలో ఇప్పు డిక నవలా ప్రక్రియ ఏ గుణాత్మక అభివృద్ధిని సాధిస్తుందో ఏ మానవ జీవన విలువలను ప్రస్థానం చేస్తుందో వేచిచూడాలి.

## పాద సూచికలు

1. కె. చిరంజీవి - జోలో స్వతంత్ర భారత్‌కి జై, ప్రచురణ : విజయలక్ష్మి మెమోరియల్ ట్రస్ట్ 18-4-288 అలియాబాద్, హైదరాబాద్, 500253, నవంబరు 1984.
2. అల్లం రాజయ్య - అగ్నికణం, విరసం ప్రచురణ, 1983.
3. యండమూరి వీరేంద్రనాథ్ - తులసిదళం, నవభారత్ బుక్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ, 31-8-81 (ఐదవ ముద్రణ)
4. సూర్యదేవర రామ్‌మోహన్‌రావు - త్రినేత్రుడు నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, జులై 1988.
5. రావిశాస్త్రి - సొమ్ములు పోనాయండి, 1980 (స్వాతి అనుబంధం)
6. అల్లం రాజయ్య - ఊరు, విరసం ప్రచురణ, 1982.

7. బీనాదేవి - కెప్టెన్ కథ, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, డిసెంబరు 1984.
8. కె.ఎన్.వై. పతంజలి - ఖాకీవనం - చతుర, నవంబరు 1980, వంశీ కృష్ణ పబ్లికేషన్స్, విజయవాడ, ఏప్రిల్ 1987.
9. యం. వి. తిరుపతయ్య - బతుకు, చతుర, మే 1987.
10. కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి - జైలు, చతుర, మార్చి 1987.
11. సాహు, అల్లం రాజయ్య - కొమురం భీం, విరసం, ఏప్రిల్ 1983
12. వసంతరావు దేశపాండే - అడవి, చతుర, ఫిబ్రవరి 1988
13. ఎస్. ఆర్. పవన్‌కుమార్ - నల్లవజ్రం, అబంపి పబ్లికేషన్, గోదావరి ఖని, నవంబరు 1987
14. జాతశ్రీ - సింగరేణి మండుతోంది, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, మార్చి 1988
15. రంగనాయకమ్మ - జానకివిముక్తి (3 భాగాలు), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, ఏప్రిల్ 1981, జులై 1983
16. ఓల్గా - స్వేచ్ఛ, చతుర, ఫిబ్రవరి 1987
17. ఓల్గా - మానవి, చతుర, డిసెంబరు 1989
18. మాలతీచందూర్ - ఆలోచించు, క్వాలిటీ పబ్లిషర్స్, మార్చి 1970
19. డి. కామేశ్వరి - జీవితం చేజార నీయకు, చతుర, జులై 1987
20. సూర్యదేవర రామ్‌మోహన్‌రావు - మోడల్, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, జనవరి 1986
21. చూడు నైతిక విప్లవం (నైతిక విలువల పునరుద్ధరణోద్యమ మాసపత్రిక (ఎడిటర్ : ఈదర గోపీచంద్, నరసరావుపేట) ఏప్రిల్-మే 1989, పు : 11, 14
22. వివరాలకు చూడు : నైతిక విప్లవం, 26 ఫిబ్రవరి 89, పు : 8, 9
23. మల్లాది వెంకట కృష్ణమూర్తి - రచయితలకు స్వేచ్ఛలేదా? ఆంధ్రభూమి, 12-5-89 & 22-7-89.

# ఈ దశాబ్దంలో తెలుగు కథానిక

—శ్రీ వాకాటి పాండురంగారావు

తిరుపతి మహాక్షేత్రంలో నిత్య కల్యాణం పచ్చతోరణం, వేలాది యాత్రికులు; లక్షలాది రాకపోకలు: కోట్లాది రూకలు.

ఆశ్రయానికి సత్రాలు, హోటళ్ళు, పందిళ్ళు.

జుత్తు ఇచ్చేవారు, లడ్లు కొనేవారు, కాలినడక వారు, 'కాంటిస్సా' కార్ల వారు. నామాల దేవునికి ఒక్క సెకెండు కాలం చూచే నిమిత్తం గంటల తరబడి వేచి వుండేవారు. తిన్నగా హెలికాప్టర్‌లో దిగి, శేషవస్త్రం స్వీకరించి, క్షణాల మీద గర్భగుడిలోకి వెళ్ళగల వారు.

నామాలు పెట్టేవారు, పెట్టించుకునే వారు.
టోపీలు పెట్టేవారు, పెట్టించుకునే వారు.
ముక్తి వుందో లేదో తెలియదు.
రక్తి, ధనశక్తి అనుక్షణం ప్రత్యక్షం.

—మరి భక్తి, వున్నట్లా లేనట్లా? అని అడిగితే 'ఉంద' అని గట్టిగా అనలేము; 'లేదు' అని చెబితే సంపూర్ణ సత్యం కాజాలదు.

సరిగ్గా తెలుగుకథ పరిస్థితీ ఇంతే!

ఈ కథా క్షేత్రంలో దిన, వార, మాస పత్రికల కోలాహలం; వందలాది రచయితలు; వేలాది కథలు.

కథ అంటూ రాస్తే ఆశ్రయానికి అనేక సచిత్ర, సకుటుంబ, సపరివార, స-మేత, స-కూత పత్రికలు

కథ రాసి పారితోషికం అందుకునేవారు, డబ్బు ఇచ్చి కథలు అచ్చు వేయించుకొనేవారు, వేల సంఖ్యలో రూపాయల బహుమతులను 'నీకు సగం' - 'నాకు సగం' అని ముందస్తుగానే అనుకుని పంచుకునే 'కత'కులు- సంపాద(న) కులు, నిజాయితీతో నిష్ఠతో రాసేవారు, కథాంగన వలువలు ఒక్కటొక్కటిగా ఒలిచే దుశ్శాసనులు, అచ్చులో పేరు కనబడితే 'అగ్రాసమ్' పొందే అల్ప సంతోషులు, ఎముకలను నెత్తురులో ముంచి రాసే ఎండమావులు, ఆలోచన అన్నది గ్రహాంతర వాసులెవరిదో కాని కాదనిపించే రాతపని వారు- సినీమాంబళం కోసం కథలచెట్టెక్కే నాటుటెన్సింగులు,— పడికట్టురాళ్ళు పేర్చి మార్గము, ధ్యేయము 'ఇదుగో ఇలాగే ఉండాలి సుమా' అని కన్నెర్రచేసే అద్వైతులు.—

ఈ విధంగా ఇక్కడకూడా హడావిడే! మంచికథలు రావడంలేదా అంటే వస్తున్నాయి. 'ఏవీ, ఎక్కడ' అని అడిగితే కొంత తడబడవలసి వస్తూంది. తిరుపతిలో మన మిత్రుడు పైడితల్లి ముఖరాజం ఏ మిలమిలమెరిసే బోడి గుండుక్రింద వుందో కనుక్కోవడంలో ఎంత ఇబ్బంది వుందో ఏ శ్రీదేవి అట్టబొమ్మ క్రింద ఏ మంచి కథవుందో గుర్తించడంలోనూ అంతే ఇబ్బంది వుంది.

గణాంకాలు (పత్రికలు, సర్క్యులేషన్లు, పారితోషికాలు, పోటీలు, బహుమతులు) ఘనంగా వున్నాయి.

గుణంబట్టి చూస్తే నూరింట ఒకటో రెండో చేటమీద మిగులుతాయేమో!

ఈ చెరిగే పనిని చేపట్టవలసిన సహృదయులు, సంస్థలు, వేదికలు ఇంచు మించు లేకపోవడం ఈ దశాబ్దపు పెద్దలోటు.

"కథలా, అబ్బే అమ్ముడు పోవండీ!' అనే ఏలూరురోడ్డు పబ్లిషర్ల శల్యసారథ్యం మంచికథా సంకలనాలు రాకపోవడానికి ఇంకో కారణం.

'చిక్కటికథ రాసేకన్న పల్చటినవల రాస్తే పేరు, డబ్బు వస్తాయి కదా' అన్న రచయితల ప్రలోభం ఇంకో కారణం.

ఇంకా కొంచెం లోతుకు దిగితే—

సమాజంలో అన్యాయానికి దోపిడికి గురయినవారు, ఆర్తులు, - వారి మీద కథల వెలుగును ప్రసరింపచేసి, "నేను ఈపూట తిన్నాను గనక ప్రపం

చమంతా హాయిగా వుందిలే!" అనుకునే సోమరిస్వాముల వీపులమీద ఛెళ్ళు మన్పించడం చరిత్ర ఈ శతాబ్దంలో రచయితల కిచ్చిన మహదవకాశం. పరపీడన పరాయణత్వపు విశ్వరూపాన్ని వెయ్యితీరుల ఢంకా బజాయించి చెప్పడం ప్రతి రచయిత కర్తవ్యం. అయితే - అట్లా చెప్పే కథలన్నీ వామ పక్ష సిద్ధాంతాలను తు.చ. తప్పకుండా అనుసరించాలి అనే వర్గం చాల విస్తృతంగా వున్నప్పటికీ వారితో ఏకీభవించడం కష్టం. ఆకలితో అలమటించేవా రందరూ 'పాలు' అని, రెండుపూటల భోజనం చేసినవా రందరూ 'నీరు' అనీ, మధ్య నొక ఎర్రగీత గీచి, దానిని దాటకండి అని హుంకరించే అంపైర్ మహాశయులకు వినయపూర్వకంగా మనవి చేయవలసిన మాటలు ఒకటి రెండున్నాయి.

ఏ రచయిత చిత్తశుద్ధినీ శంకించ వలసిన అవసరం లేదు. 'నాది కాక ఇంకొక భిన్నమైన అభిప్రాయం వుండడానికి కూడా అవకాశం వుంది' అని ప్రాథమికంగా అంగీకరిస్తే కలాల్లో కులాలుండవు; కులాంతర వివాహాలు జరుగుతాయి. ఆకలి అసలు సమస్య; అది తీరకుండా అడ్డుతున్న అగాధాలు ఏమిటి అని ఆలోచించవలసి వస్తుంది. ఆలోచన మొదలయితే ఆవేశం తగ్గుతుంది; ఆవేశం తగ్గితే ఆలోచన మొదలవుతుంది.

ఒక్కసారి ప్రపంచంకేసి చూద్దాం. పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించిన అమెరికా, జపానులు; కమ్యూనిజాన్ని స్వీకరించిన రష్యా, తూర్పుయూరపు దేశాలు - ఈ రెండు వర్గాలలో ఏదేశంలోని కార్మికుడైనా కష్టించి చేసిన పనికి తగిన ప్రతిఫలం పొందు తున్నాడా, సంపాదించిన దానితో కావలసినది కొనుక్కొని సంతోషంగా వుండగల్గుతున్నాడా - అన్న ప్రశ్నకు సరయిన సమాధానం 1989సంవత్సరపు ఉత్తరార్ధం చెప్పింది. కమ్యూనిస్టు జన్మభూమి అయిన రష్యాలోని సైబీరియన్ బొగ్గుగనుల కార్మికులు 1989లో సమ్మె చేశారు. ఎందుకని? గనిలోంచి బయటికి వచ్చాక చేతులు కడుక్కోవడానికి వలసిన సబ్బు సరఫరా కాలేదని! తూర్పు (కమ్యూనిస్టు) జర్మనీనుండి పశ్చిమ (అమెరికన్) జర్మనీకి వలస వెళ్ళిన కాందిశీకులకు ఉచితంగా 'బ్రెడ్' ఇస్తుంటే - కళ్ళ నీళ్ళుపెట్టుకున్న తూర్పు జర్మనీ వనిత-"మాకు కనీసం అయిదారు గంటలు పడిగాపులు గాస్తే కాని దొరకని ఈ బ్రెడ్ ఇంత సునాయసంగా దొరుకుతుందా" అని విస్తుపోయింది! అంటే

తమ పౌరుల కనీసావసరాలు తీర్చడంలో కూడా కమ్యూనిస్టు విధానం విఫలమయి నట్లేకదా! అంతేకాక పార్టీ ప్రముఖులు, అధికారాలు అవినీతికి పరాకాష్ఠలవడం, బంగారు కుళాయిల స్నానాల గదులను, 400 గదుల అంతఃపురాలను నిర్మించి అరబ్ షేకులకన్న అలనాటి జారులకన్న విలాసంగా 23 సంవత్సరాలు పాలించ గల చౌసెస్క్యూ వంటి నియంతలను సృష్టించింది! సృష్టించడమే కాదు వారిని తమకు తాముగా తొలగించలేనంత అస్వతంత్రులుగా పౌరులను మార్చింది! "ఇదంతా కమ్యూనిజం వల్ల కాదు స్టాలినిజంవలననే" అన్న వాదనకు 'స్టాలిన్, చౌసెస్క్యూ, హోనెకర్ వంటి వారిని కని పెంచి పోషించిన వ్యవస్థ పేరేమిటి?" అని అడగా లన్పిస్తుంది. ఆశయం ఎటువంటి దయినా ఆచరణలో వ్యక్తికి ప్రాధాన్యం వుందని తెలిసిందికదా,అటువంటి వ్యక్తుల నెలా తయారు చేయడం- అన్పిస్తుంది.

అయితే

ఈ వాదన అంతా - కమ్యూనిజం యొక్క 'పీడిత తాడిత జనోద్ధరణ' అనే అతికీలకమయిన కర్తవ్యాన్ని విస్మరించాలి అని కానే కాదు. "సోషలిస్టు సమాజ స్థాపనకు కమ్యూనిజం ఒక్కటే దారికాదు" అని ఆంధ్రప్రదేశ కమ్యూనిస్టు మేధావి ఒకరు అన్న నిజాన్ని నొక్కి చెప్పడమే కమ్యూనిస్టు విధానపు రాజకీయ వైఫల్యాల్ని ఎత్తి చూపడం యొక్క ఉద్దేశం.

అయితే మరి సిగ్గు ఆదుపు లేకుండా దోపిడి చేసే అమెరికన్ పెట్టుబడీ దారీ విధానమే శరణ్యమా? అన్నది తర్వాతవచ్చే ప్రశ్న కానేకాదు!

ప్రపంచంలోని అయిదు శాతం జనాభా వున్న అమెరికా ఈ భూగోళపు మూడవవంతు వనరులను (బొగ్గు, పెట్రోలియం, ఖనిజాలు) తన విచక్షణా రహితమైన విలాసమయ జీవనానికి దుర్వినియోగం చేసి ప్రపంచ వ్యాప్తమయిన దారిద్ర్యానికి దారితీస్తున్నది. అమెరికాలోని సైంటిస్టులు, టెక్నాలజిస్టులలో మూడవవంతు వారు ప్రపంచ మారణ హోమం నిమిత్తం పనిచేస్తున్నారు. అమెరికా యొక్క జీవన విధానం అత్యధికంగా వాతావరణ కాలుష్యానికి దోహదంచేస్తూంది; ఇంకో పాతికేళ్ళలో వాతావరణ ప్రళయం వచ్చి ఈ గోళం సర్వనాశనమయితే ఆ బాధ్యత అమెరికాదే! కనుక అమెరికా దారి సరికాదు.

మరయితే చివరకు మిగిలే దారి యేది?

పెట్టుబడిదారీ విధానం ఉత్పత్తిని త్వరితంగా పెంచుతుంది. కూడ గుడ్డలేని కోట్లాది బలహీనులను మరవకండి, మరవకండి అని ఘోషించే కమ్యూనిస్ట్ పొలికేక నెప్పుడూ మరవరాదు. కాని, ఉత్పత్తి పెరిగినంత మాత్రాన అది బలహీన వర్గాలకు అందదు - అని భారతదేశపు ఇటీవలి ఆర్థిక చరిత్ర చెబుతూంది.

వాతావరణానికి హాని కల్గించని ఉత్పత్తి విధానాలను పెట్టుబడిదారీ విధానం నుండి గ్రహించగలమా? అట్లా జరిగిన ఉత్పత్తిని కమ్యూనిజం ఎత్తి చూపిన బడుగు వర్గాలకు అందేటట్లు తద్వారా సమాజంలో తరతమ భేదాలు సమసిపోయేటట్లు పంపిణీ చేయగలమా? మానవాళి అంతా కలిసి, మారణాయుధాలకు స్వస్తిచెప్పి, శాంతిసౌభాగ్యాలతో మనగలమా? సమాజపు వనరులను, ఉత్పత్తులను బలవంతుడే కబళించకుండా వుండే విధంగా సమాజంలోని వ్యక్తుల గుణాలను రూపొందించగలమా? "ఆకలిగొన్న వాడికి అన్నమే దైవం; తన కోసం తానుగా బ్రతికేవాడు శవతుల్యుడు" అన్న వివేకానందుడి వంటి వానిని కన్న భారతదేశపు విలువల సంపుటి నుండి రేపటి వసుధైక సమతా కుటుంబ నిర్మాణానికి ఒకటి రెండు 'సమిధ' లేవయినా దొరుకుతాయా? వివిధ దేశాలలో ఆ యా కులాలలో పుట్టిన రాజకీయ ఆర్థిక విధానాలన్ని కూడా రేపటి మానవాళి కోసం ఏర్పడనున్న కొత్త ఆలోచనా విధానాన్ని కనడానికి పడుతున్న పురిటి నొప్పు లేమో! మనం అందరం కలిసి మనసువిప్పి, ద్వేషం, కావేషం లేకుండా మాట్లాడుకో లేమా?

'మాట్లాడుకో లేము! ఇలాగే ఇజాల పేరుతో కొట్టుకుంటూనే ఉంటాము' అనడం మానవజాతి నాగరికతా పరిణామం అంతటినీ తిరస్కరించడమే అవుతుంది.

—తెలుగు కథకు ఈ గొడవలకూ సంబంధం ఏమిటి అని అడగవచ్చు.

మన దైనందిన జీవితంలోని సమస్యలకు వెతికే సమాధానాలపైన సమకాలీన ఆలోచనాధోరణుల ముద్ర ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పడక తప్పదు. వాటిగురించి ఎవరికి వారుగా ఆలోచించకపోతే అరువు ఆలోచనల

బరువు చేటు తప్పదు. అట్లా ఆలోచనాగ్నిలో అనుక్షణము తప్తమవని వాడు చేసేది రచన కాదు; అది కేవలం కాగితం పాడుచేయడం మాత్రమే!

ఆలోచన అలవాటయిన వ్యక్తి ఇంకొకరి ఆలోచనా పద్ధతిని గౌరవిస్తాడు. అతని ఆలోచనతో ఏకీభవించ పోయినా సహజీవించ గల్గుతాడు. అటువంటి సహజీవన సూత్రమే అటు సైన్సు ప్రపంచంలోను ప్రతిపాదితం అయింది; ఇటు రష్యా, భారతదేశం వంటి బహుళ సంస్కృతీ సమాగమాలయిన దేశాలలోనూ ప్రత్యక్ష సత్యంగా కానవస్తూంది. ఈ ముడిసరుకునుండే మనం రేపటి లోకానికి, కవులు, కథకులు, గాయకులు కలలుగన్న నవజీవన బృందావనికి దారులు వేయాలి.

ఇందు నిమిత్తం మనం ఎవరం, మన చరిత్ర ఏమిటి, మన సంస్కారం ఎట్టిది, దానిలోని లొసుగులు అపసవ్యాలు ఏమిటి అని నిదానంగా బేరీజు వేసి అపారవంతమైన భూమిలో ఆలోచనల వేళ్ళూనాలి. ప్రపంచంలోని అన్ని వైపుల ఆలోచనల వోల్గాలనుండి జీవధారలను గ్రోలాలి.

ఇటువంటి నేపథ్యం వుంటే రచనకు పుష్టి వస్తుంది; ఆ తర్వాత రచయిత తగినంత భాషా పాటవం సంపాదించాలి. నేటి తెలుగు కథలలో కొట్టవచ్చినట్లు కనపడేది రచయితల భాషా పరమయిన 'అనీమియా'. భాషపట్ల శ్రద్ధ వహించక పోవడం అనాగరికతా లక్షణం అని మేధావులు చేసిన రోగ నిదానం.

ఆకలి గురించి రాసినా, కథాకళి గురించి రాసినా కథ నిండుగా, నిజంగా వుండాలి. ఆనందాన్నయినా ఇవ్వాలి; అలజడి నయినా కల్పించాలి. కాలక్షేపం కోసం సరదా కథలు రాయవచ్చు; చదవవచ్చు. కాని వోడ్‌హవుస్, థార్న్ స్మిత్‌ల వలె వాటిలోనే బోలెడంత లక్ష్య శుద్ధి ఇముడ్చవచ్చును.

రాసే ప్రతి కథకూ కనీసం పదికథలైనా చదవాలి. (అంటే "దిగుమతి" వ్యాపారార్థం కాదు!)

నిష్ఠ గల రచయిత ఒక తాపసి వంటివాడు. అతడు బహుమతులకు, పదవులకు, శాలువాలకు, బిరుదులకు, చప్పట్లకు, చవకబారు ప్రచారాలకు లొంగి పోడు. అతడి వ్యక్తిగత జీవితం, అతడికి సమాజానికి మధ్యగల సంబంధం,

అతడి ఆలోచన, అతడి రచన ఇవన్నీ ఒకే చెట్టులోని కొమ్మలు, ఆకులు, పువ్వులు పండ్లవలె వుంటాయి. నిజమే! బ్రతుకుబాటలో రాజీలు తప్పవు; కనీసం వాటిని తగ్గించే యత్నమయినా చేయాలి; లేదా తాను రాజీపడిన విషయం మీద సమాజానికి తన రచనద్వారా ఉపదేశాలూ సందేశాలూ ఇవ్వరాదు. ఉదాహరణకు, జాతకాలను నమ్ముతూ, జ్యోతిష్యులను సంప్రదిస్తూ వుండే వ్యక్తి రచయితగా ఆలాటి ఇతర నమ్మకాలను హేళనచేయడం అంతటి దగా ఇంకొకటి వుండబోదు. దొంగ బాబాలు మతంలోనే కాదు రచనల మఠంలోనూ కొలువు తీరి వుండ వచ్చును.

అదృష్టవశాత్తు మన యువతరం రచయితలలో రచయిత్రులలో తెలుసు కోవాలి అనే తపన వున్నది. అపారమయిన పరిశీలన శక్తితో సరికొత్త దృక్పథంతో కథను చెప్పగల సత్తా వున్నది. హాయిగా చదివించగల రచనలు చేసే గుణం వారి కలాలలో దాగివుంది. వారికి గనుక తగుపాటి ప్రాక్పశ్చిమ సాహిత్య పఠనానుభవం, నేటి జీవితపు వివిధ రంగాల యొక్క బలాలు బలహీన తలు బేరీజువేయగల శక్తి, తను నమ్మిన దానిని ప్రపంచమంతా ఎదిరించినా సరే స్పష్టంగా, సవినయంగా చెప్పగల విచక్షణ అలవరచుకుంటే - రాబోయే దశాబ్దం తెలుగు కథల చరిత్రలో శుక్లపక్షం అయి తీరుతుంది.

"ఏ సాహిత్యంలోనయినా కొత్త ఇతివృత్తాలు అంటూ ఏవీ వుండవు. మానవ స్వభావపు ఆకార వికారాలూ అంతే! ఎటొచ్చీ వీటి మీద ఆయా యుగాల వెలుగునీడలు పడ్డప్పుడు పాత ఘర్షణలే కొత్త అవతారం ఎత్తుతాయి." అని చెప్పిన ఆర్థర్ కోస్లర్ మొత్తం ప్రపంచ సాహిత్యానికే ఆధారభూతం అయిన ఇతివృత్తాలు (Plots) 36 అని జర్మన్ కవి, తాత్వికుడు గెతే నిర్వచించడాన్ని గుర్తు చేస్తాడు.

ఇది తెలుసుకుంటే రచయితకు వినయం వస్తుంది. అది నేటి రచయితలలో చాలమందికి అబ్బని గుణం! తన లోట్లు తెలుసుకుని, వాటిని క్రమేపి తగ్గించు కోవడానికి యత్నించనివాడు మనిషేకాడు; మనిషి కానివాడు రచయిత ఎట్లా అవుతాడు? కాలు లేనివాడు కొండెక్కడం సాధ్యమా?

పఠనశీలత, సౌజన్యం, వినయం, శబ్దం మీద అధికారం, సమకాలీన జీవనం మీద సమగ్రమైన అవగాహన వున్నవాడు ఏం చెప్పినా వినసొంపుగా వుంటుంది. ఏమి రాసినా చదవబుద్ధి వేస్తుంది. ఇవి కొరవడినప్పుడు పరిస్థితి ఎలా వుంటుంది?

"మన సాహితీ క్షేత్రం ఎందరో మహానుభావుల మనసులనే నాగళ్ళుదున్ని పదును చేసిన మంచి మాగాణి. పచ్చని పైర్లతో కళకళ లాడిన ఆ సుక్షేత్రం ఇప్పుడు బీడుపడి వుంది. అక్కడ ఇప్పుడు కలుపు మొక్కలు ఏపుగా పెరిగి వున్నాయి. దాని నిండా ఫ్రెంచి, ఇంగ్లీషు, జర్మన్ పుస్తకాల రంగుల అట్ట కాగితాల పీలికలు రెపరెపలాడు తున్నాయి. మనకు చెందనివి, మనవి కానివి అయిన దివాళాకోరు పాశ్చాత్యుల అభిప్రాయాలు వేళ్ళూను తున్నాయి...మానసికంగా బలహీనులయిన వారి ఆలోచనల నుండి బయలుదేరిన సుఖ రోగాలు సాహిత్యపు పుటలద్వారా విష రోగ క్రిములను వ్యాపింప చేస్తున్నాయి" అని ఈ శతాబ్దపు మొదటి దశాబ్దంలో మేక్సిం గోర్కీ చేసిన హెచ్చరిక - ఈ శతాబ్దపు ఆఖరి దశాబ్దంలో తెలుగు కథకు సరిగ్గా అతకడం—

నిజంగా తెలుగు కథకు గర్వకారణం అనగలమా?

# ఈ దశాబ్దంలో పత్రికారచన

## —డాక్టర్ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

పత్రికల ధోరణులను భాషా శైలీవార్తా శీర్షికాపరంగా అంచనాకట్టడానికి పది సంవత్సరాలు ఏమంత పెద్దసమయం గాకపోయినా కొంతలోకొంత వాటి గురించి చెప్పుకోవచ్చు.

మొత్తం పత్రిక వ్యాపారవస్తువు అయింది. అందుచేత లక్ష్యాలు ఆదర్శాల కోసం తడుముకోవడం వ్యర్థప్రయాస.ఇందులో మంచీచెడూ రెండూ వున్నాయి. పత్రికల సర్క్యులేషన్ యెంత? ప్రకటనలు యెంత? పూర్వం పత్రికలు పెట్టడం అంటే చేతులు కాల్చుకోవడం క్రిందే లెక్క. ఇప్పుడు ఎవరయినా ఎందుకు పత్రిక పెడతారంటే అది ఒక 'పవర్' హవుసు లాంటిది గనుక. పత్రిక కంటే పవర్ (శక్త్యాత్మక స్థానం). తమ తమ ఆస్తుల అవసరాల పరిరక్షణకు శ్రీమంతులకు భూస్వాములైన ధనవంతులకు పత్రికలు - సినిమాలు కవచ కుండలాల్లాంటివి.

ఈ దశాబ్దంలో చెప్పుకోతగ్గ దినపత్రికలు రెండేరెండు. ఈనాడు-ఉదయం పత్రికలు. ఇవి రెండూ 1980-1990 ల మధ్య పత్రికారచన ఎలావుందో చెప్ప డానికి పనికివస్తాయి.

ఈరెండు పత్రికలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఈనాడు సంస్థ యజమాని శ్రీ చెరుకూరి రామోజీరావు కాగా, ఉదయం అధిపతి శ్రీ దాసరి నారాయణరావు. ఈ యిద్దరు పెద్దలు-సాహిత్య రంగంమాట అటుంచితే-పత్రికా రచనకు (వ్యవ స్థకు) పూర్తిగా కొత్తవారు. ధనవంతులు వ్యాపారస్థులైన యీ ఉభయులూ దిన పత్రికలు అనుబంధంగా సినిమా పత్రికలు యిత్యాది ప్రారంభించి అఖండ విజ యాలు సాధించారు. పత్రికారచనలో వీరు తెచ్చిన మార్పులేమైనా ఉన్నాయా అనేది ప్రస్తుతాంశం.

హైందవ మతము, భారతీయ సంస్కృతి, సాహిత్య సాంస్కృతిక రంగాల పట్ల యీ ఉభయ సంస్థలకు సద్భావం లేదు. దాదాపు పాత సాంస్కృతిక సాహిత్య కళారంగాలతో తెగదెంపులు చేసుకొని వ్యాపారకళ సినిమాను మాత్రం పెంచి పోషించి సాకి సంరక్షించుకున్నారు. ఈ రెండు దినపత్రికలకు ప్రారంభ దశలో ఒక కమ్యూనిస్ట్ మేధావి రెండవరకం జర్నలిస్ట్ పనిచేశాడు. వీరు దాదాపు నిరీశ్వరవాదులు. హైందవమత సంస్కృతి సాంప్రదాయాలకు పురాణేతిహాసాలకు బద్ధశత్రువులనలేము కాని ఆవిషయాల అవగాహనకు వుండవలసినంత సంస్కారం వున్నవారు కాదు. ఉదయం దినపత్రిక ఆదిపర్వంలో ఈనాడు ఆదిసభాపర్వాలలో పత్రికలను నిర్వహించిన వ్యక్తి (ఎ.బి.కె. ప్రసాద్) నిర్వహించడం వలన యీ పత్రిక మీదకూడా సాంస్కృతికపు బరువుబాధ్యతలు (బర్డెన్ ఆఫ్ ది పాస్ట్) పడలేదు. ఈనాడు పత్రికను విసర్జించి వచ్చిన ఎడిటర్ ఛాయలే ఉదయం మీద దట్టంగా అలుముకున్నాయిగాని పాపం శ్రీ దాసరి నారాయణరావు ప్రభావం భావాంబరవీధి లో యేమీ లేదు సి.పి.ఐ, సి.పి.ఐ. (యం.ఎల్).సి.పి.యం పార్టీల ప్రభావం యీ రెండు పత్రికలమీద వున్నట్లు మిగతా పత్రికల మీద లేదు.

అంతవరకు వచ్చిన పత్రికా రచనా నిర్వహణ సంప్రదాయాలను ధ్వసంచేశారు. పాత నుపడగొట్టనిదే కొత్తను నిలబెట్టలేము అనే సూత్రం కొంత వరకు నిజం. తెలుగు జర్నలిజం మితవాద దృష్టినుంచి, సుంభమిత వాదానికి దిగి పూర్తిగా వామపక్ష వాదాన్ని గ్రోలి, చివరకు అతివాద సరస్వతికి ఆశ్రయం యిచ్చింది

దీన్ని వివరించాలంటే ఆంధ్రపత్రిక మితవాద ధోరణికి పూర్తిగా కట్టుబడి వుండగా, ఆంధ్రజ్యోతి కాస్త హేతువాదాన్ని నిరీశ్వరత్వాన్ని ఆశ్రయిస్తూ యింకా మితవాద పత్రికగానే వుంటూ వచ్చింది. ఆంధ్రప్రభ దినపత్రిక హైందవ సంప్రదాయ దృక్పథాన్ని అవలంబిస్తూ ఆస్తికధర్మాన్ని నిలబెడుతూ కాంగ్రెస్ వ్యతిరేకతతో మితవాద దృక్పథాన్ని అవలంబిస్తూ వుంది. ఈనాడు వామపక్ష భావాలతో పాటు నాస్తిక దృక్పథాన్ని, హేతువాదాన్ని సమర్థిస్తున్నది. అలా వుంటూ సమాజంలో ఒక వర్గం వారి పక్షపత్రికగా వుంటూ ధనిక స్వామ్య విలువలకు ముప్పు రాకుండా కొమ్ము కాస్తున్నది. తెలుగుదేశం పార్టీ

ఏర్పడినప్పటి నుంచి పాలకవర్గపు దినపత్రికగా మారింది. మావారైనంత మాత్రన మేం ఉపేక్షించేది లేదు అన్నట్లు తెలుగు దేశాన్ని, యన్. టి. రామా రావును విమర్శించినా, అంతరాంతరాల్లో ఈనాడు ఒక పక్షం వహించే శక్తి మంతమైన పత్రిక. ఉదయం మితవాద దినపత్రిక కాదు, జాతీయ దిన పత్రిక కాదు. కాంగ్రెస్ (ఐ) పార్టీకి చెందిన పత్రిక. శ్రీ దాసరి నారాయణరావు దిన పత్రిక పెట్టి తన ప్రతిష్ఠ యినుమడింప జేసుకోవాలని అనుకున్నాడు. డబ్బు వుంది. వనరులున్నాయి. పైగా గోదావరి జిల్లాలు తదితర చోట్ల ఒక పెద్ద వర్గం తనవైపు వున్నది. ఆంధ్రపత్రిక యీ దశాబ్దంలో బి.జె.పి. జనసంఘ్ వైపు తిరుగగా, ఆంధ్రజ్యోతి కాంగ్రెసు(ఐ) పత్రికగా వుంటూ పూర్తిగా తెలుగు దేశం ప్రభుత్వానికి పార్టీకి మద్దతు యిస్తూ వచ్చింది. అదే మార్గంలో కమ్యూనిస్టు పత్రికలు కాంగ్రెసు (ఐ)ని వ్యతిరేకించడం ద్వారా ముసుగులో కులతత్వానికి పేరెన్నికగన్న తెలుగుదేశం పార్టీని ప్రభుత్వాన్ని సమర్థించాయి.

ఏ విశ్వవిద్యాలయం జర్నలిస్ట్ విభాగంవారైనా యీ అంశాలపై పరిశోధన జరిపి నిజాలను బయట పెట్టవచ్చు. మనవాళ్ళకోసం మనవాళ్ళు నడిపే పత్రిక అంటూ పాఠకులను తనవారు పరాయివారు అని విడగొట్టి ఆకర్షించ డానికి ప్రయత్నాలు జరిగాయి.

—పత్రికా పాఠకులు వినియోగదారులుగా మారారు.

—వార్తలను సమాచారం అందించడానికి గాక అమ్మకానికి వార్తలను దినుసుగా భావిస్తున్నారు.

—శీర్షికలు వార్తలను వాటి ప్రాముఖ్యాన్ని తెలియజేయడానికి గాక హెడ్డింగులను చూసి ఎక్కువమంది పాఠకులు పత్రికను కొని చదివేలా ఆకర్షించడానికి ప్రయత్నిస్తున్నారు.

—శిష్టమైన యోగ్యమైన వ్యావహారిక భాషమీద నింద్యమైన గ్రామ్యభాష దాడి చేస్తున్నది.

—సినిమా సంస్కృతి దాని వికృతరూపంలో సంకరమైన భాషను, రెచ్చ గొట్టే ఫొటోలను, సెక్సీ డైలాగులను, దాదాపు పచ్చి శృంగారాన్ని

న్యూస్, జాగాలో పాఠకులను ఆకర్షించడానికి యిస్తున్నారు. సినిమా జర్నలిజంలో విమర్శ, సమీక్ష, గుణదోష నిరూపణం పూర్తిగా మృగ్య మయి సోత్కర్ష ఆత్మస్తుతి మితిమీరిన స్తోత్ర పాఠాలు తాకి బిరుదులు ఎక్కువయ్యాయి.

—ఆంగ్లభాషను యథేచ్ఛగా వాడటం ఎక్కువయింది.

—వార్తలను అనువదించడంవలన ఒక కృతకమైన తెలుగు, పత్రికలలో వర్ధిల్లి ఆ తెలుగు పాఠకులను దూరం చేస్తున్నది.

—ఆంగ్ల వాక్యనిర్మాణం, ఆంగ్ల వ్యాకరణ ధర్మాలు తెలుగు అనువాద సరళిని పట్టి పీడిస్తున్నాయి.

—దినపత్రికలు గృహిణులను యువతీయువకులను ఆకర్షించడానికి నవల లను అందులో ముఖ్యంగా సస్పెన్స్ థ్రిల్లర్‌లను ప్రచురించడంతో వార పత్రికల జర్నలిజం దినపత్రికలలో చోటు చేసుకుంది.

—ఆదివారం అనుబంధాలను పూర్తిగా మార్చివేశారు. అందులో విదేశీ పత్రికల నుంచి కత్తిరింపులను, దొంగలించిన ఫారిన్‌ఫీచర్స్‌ను వేస్తు న్నారు. ఈ కారణంచేత తెలుగు పాఠకులు ఎందుకూ పనికిరాని చెత్త ఫీచర్స్, చెత్త వ్యాసాలు చదివి మన సాంస్కృతిక చైతన్య పరిధి నుంచి వేరుచేయబడుతున్నారు.

—మన చరిత్ర, మన సంస్కృతి, మన నాగరకత, మన అభిరుచులు యిష్టానిష్టాలమీద గురి గౌరవం లేని జర్నలిజం నేడు అవతారమెత్తి పాఠకులను కన్స్యూమర్లగా మార్చడానికి ప్రయత్నిస్తున్నది. ఇది తెలిసి చేసినా తెలియక చేసినా నేరమే.

—దినపత్రికలలో సెక్స్ సమస్యలపై చర్చను, వ్యాసాలను, ప్రశ్నోత్త రాలను ప్రవేశపెట్టి మితవాద దృక్పథాన్ని దెబ్బతీసింది ఈనాడు పత్రిక. ఈ అవకాశం కోసం ఎదురుచూస్తున్న వార మాసపత్రికలను సెక్స్ విశేషంగా ప్రభావితం చేసింది.

ఈ నేపథ్యంలో 1980-1990 ల మధ్య పత్రికా రచన పాత సంకెళ్ళను త్రెంచుకొని కొత్తపాఠకుల కోసం మార్కెట్ పరిధులను విస్తృతం చేసుకుంటూ పోయింది. ఇది ఒకరకంగా పాతకొత్తల మధ్య సంధియుగం. దినపత్రికల మార్కెట్లను అనూహ్యంగా పెంచడం, ఎడిషన్లమీద ఎడిషన్లు ప్రారంభించి రెండున్నర మూడున్నర లక్షల కాపీలను పెంచిన ఘనత ఈనాడు అధినేత శ్రీ రామోజీరావుదే. ఆధునిక మార్కెటింగ్ పద్ధతులను ప్రతికా రంగానికి వర్తింపచేసి సర్క్యులేషన్లలో రికార్డులను బ్రద్దలుకొట్టిన ప్రజ్ఞ ఈనాడు వారిదే నిజంగా ఒక పత్రికా సామ్రాజ్యాన్ని కొత్త పునాదులపై నెలకొల్పి మందకొడిగా వున్న పత్రికారంగాన్ని వాణిజ్య విలువలతో ఒక బలీయమైన శక్తిగా రూపొందించిన విశిష్టత ఈనాడుదే. ఈ విస్తృతమైన మార్కెట్‌ను, మరింతగా పెంచి విపరీతమైన సర్క్యులేషన్లను అనుకోకుండా సాధించిన ఘనత శ్రీ దాసరి నారాయణరావుది. ఇది ఒక ఉప్పెన - యీ మహాప్రయత్నంలో పాత కొట్టుకుపోయి కొత్త నిలిచింది.

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యంగా వ్యవసాయరంగాన్ని వ్యాపార పారిశ్రామిక రంగాలను సినిమాతో సహా ఏలుతున్నది కమ్మవారు, రెడ్లు, కాపులు, తరువాత రాజులు, వెలమవారు యిత్యాదయః, ముస్లిములు, క్రైస్తవులు, హరిజనులు, నిమ్న జాతులు, వెనుకబడిన వర్గాలవారు - వీరే మన ముఖ్య జనాభా. రాజ్యాధికారం మొట్టమొదటిసారి కమ్మవారు రెడ్లనుంచి లాక్కున్నారు. తిరిగి రెడ్లు కమ్మవారి నుంచి కైవసం చేసుకున్నారు. మిగతా కులాల వారందరూ వీరికి అటూ యిటూ కొమ్ము కాశారు. మన జనాభాలో స్త్రీల శాతం యించుమించుగా సరిసమానంగా వుంటున్నది.ఇందులో నిరక్షరాస్యుల శాతం పెరుగుతూ రాగా అక్షరాస్యుల సంఖ్య సుమారు 33, 34, 35 శాతంగా వుంటూ వస్తున్నది.స్వాతంత్ర్యోద్యమ కాలంలో అంతకు ముందు వీరేశలింగం కాలంనుంచి సంఘ సంస్కరణోద్యమంలో భాగంగా స్త్రీ విద్య ప్రముఖ స్థానాన్ని పొంది క్రమేపీ అన్ని రంగాలలోనూ స్త్రీలు ప్రముఖపాత్ర వహిస్తూ సంప్రదాయ సంకెళ్ళనుంచి బయటపడ్డారు.

ఈ నేపథ్యంలో పత్రికలు, పుస్తక ప్రచురణలు జవాన్నీ జీవాన్నీ పుంజుకున్నాయి. వీటికి తోడు కమ్యూనిస్ట్ పార్టీ నేపథ్యంలో అభ్యుదయ రచయితల

సంఘం, తరువాత విప్లవ రచయితల సంఘం వచ్చాక ప్రజల భావాలలో ఆలోచనలలో ఆచరణలో చాలా మార్పు వచ్చింది. నక్సలైట్ ఉద్యమ ప్రభావం స్పష్టంగా పత్రికలమీద వుంది.

ఎడిటర్లలో నార్ల, గోరాశాస్త్రి, కవులు రచయితలలో జర్నలిస్టులలో ప్రముఖులైన శ్రీ శ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, పిలకా గణపతిశాస్త్రి, పండితారాధ్యుల నాగేశ్వరరావు, బి. సి. కామరాజు యిలా పత్రికా రచనను ప్రభావితం చేసిన వారెందరో కాలధర్మంచెందారు. వీరందరితో తెలుగు సాహిత్య పత్రికా రంగాల నుంచి దిగ్దంతులు వెళ్ళిపోయారు. Age of eminence నిష్క్రమించి Age of expansion అన్నిటా వచ్చింది.

ఈ ప్రస్తుత దశాబ్దంలో ఎడిటర్ పవర్స్ తగ్గిపోయాయి. ఎడిటర్ని ముసుగేసి మూలకూచోపెట్టి మార్కెటింగ్ పరిభాషలో సీనియర్ ఎగ్జిక్యూటివ్ అన్నారు. మేనేజర్లు అనగా అడ్వర్టయిజ్‌మెంటువారు, సర్క్యులేషన్స్ మార్కెటింగ్ వారు, ప్రింటింగు శాఖ వారు యింతమంది అడుగుజాడల్లో కనుసన్నలలో ఎడిటర్ వ్యక్తిత్వం అతని హోదా పవర్సు అన్ని కుంచించుకు పోవడమేకాదు లాగిపారవేశారు. పూర్వపు సంపాదకుల జర్నలిజాన్ని కండువా జర్నలిజం అన్నాం; నేటి జర్నలిజాన్ని గుమాస్తా జర్నలిజం అనవచ్చు. ఈ పరిణామం నార్ల తరువాత, గోరాశాస్త్రి తరువాత ఈనాడు ఆవిర్భావంతో దొండపాదులా విస్తరిల్లింది. ఇహ పత్రికారచన ఎలా మారిందో కాస్త గమనిద్దాం.

## సంపాదకీయాలు :

స్వర్గీయ M.C. అంటే, M. చలపతిరావు గారు నేటి సంపాదకీయాలకు ప్రొప్రయిటోరియల్స్ అని చమత్కరించారు. నేటి పత్రికా యాజమాన్యానికి రాష్ట్రంలో ప్రభుత్వంతో అనేక లావాదేవీ లుంటాయి. కేంద్రంతో కూడా పనులుంటాయి. వారి వారి వ్యాపార ప్రయోజనాలకు భంగం కలగకుండా పత్రికను సంపాదకుడు నిర్వహించాల్సి వస్తుంది. ఒకప్పుడు ప్రారంభ దశలో ఈనాడువారు సంపాదకీయాలు అవసరమా అనవసరమా అని కూడా చర్చించారు. అప్పుడప్పుడు రాస్తే సరిపోలా, రోజూ ఎందుకు అని కూడా తర్కించారు.

తరువాత ఎవరిచేతనైనా వ్రాయించ వచ్చు దబ్బిచ్చి అనే నిర్ణయానికి కూడా వచ్చారు. ఇది అలా వదిలేస్తే, మొత్తానికి సంపాదకీయాలు వుంటూ వచ్చాయి. ఈనాడు ఒక కొత్త సూత్రాన్ని పత్రికలో పవేశపెట్టింది. ఎడిటర్ ఎగ్జిక్యూటివ్స్‌లో భాగం కనుక అతనికి ఎటువంటి ప్రత్యేక ప్రతిపత్తి వుండరాదు. ఎవరిపేరుమీద ఏమీ వుండ కూడదు. 'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' అన్నట్లు వుండాలి. రచయితల వ్యక్తిత్వం గాని వారి పేర్లు గాని అంతముఖ్యం కాదు. ఈ ధోరణిని యితర పత్రికలు పాలో కాలేదు. ఈనాడు ఒరవడిని కాస్తో కూస్తో తులసి తీర్థంలా అంతా స్వీకరించి తమ ఫణితి మార్చుకున్నారు.

సంపాదకీయాల ఒరవడిని, శైలిని, భాషను సంప్రదాయాన్ని పెద్దగా ఈనాడు మార్చలేక పోయింది. ఈనాడులో రాయడం వలన ఎవరికీ పేరు రాదు. గుర్తింపు కూడా రాదనే వదంతి వచ్చేసింది.

## వార్తలు:

రాజకీయ ప్రసంగాలకు, రాజకీయాలకు మునుపటి ప్రాధాన్యం వుండనే వుంది. ఈనాడు ప్రత్యేకత ఏమిటంటే సినిమా వార్తలకు ప్రగల్భాలకు ఉదయం, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభలలో వున్నట్లు అందులోలేదు. ఈనాడు సినిమా సార్వభౌముల తోక జాగ్రత్తగా కత్తిరిస్తూనే వుంది. ప్రాంతీయ వార్తలకు హెచ్చు ప్రాముఖ్యం యిచ్చి ఈనాడులో పడింది అంటే మురిసిపోయే అవస్థ కల్పించింది.

## ఆదివారం అనుబంధం :

ఆదివారం అనుబంధాల నుంచి సాహిత్యాన్ని మతాన్ని హైందవ సంస్కృతిని పూర్తిగా విసర్జించిన ఖ్యాతి ఈనాడుకే దక్కుతుంది. ఉబుసుపోకకు, సరదాకు, చదివిపారేసే తేలిక విషయాలకు గమ్మత్తులను ముఖ్యంగా వైదేశికలను that which sells అనే ప్రాతిపదికమీద నడిపి కాల్పనిక సాహిత్యాన్ని యాడ్చితన్ని మెడట్టుకు వీథిలోకి గెంటేసింది.

పులిని చూసి నక్కవాతలు పెట్టుకొన్నట్లు మిగతా పత్రికలు ఈ ఒరవడిని కొంతవరకు అనుకరించాయి. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక ధోరణు

లలో వేరైనా సాహిత్యం, మతం, సాంఘిక వైజ్ఞానిక విషయాలను జోడించి పాతకొత్తల మేలుకలయికగా నడుస్తున్నాయి, ఆంధ్రజ్యోతి వ్యావసాయిక రంగానికి ప్రత్యేక వ్యాసాలు ప్రశ్నోత్తరాల ద్వారా ఎనలేనిసేవ చేసింది. ఈనాడువారు కూడా అన్నదాత ద్వారా రైతులకు వారివారి సమస్యలపై ఎన్నోఏళ్ళుగా వ్యాసాలను ప్రచురిస్తూ ఎనలేని సేవ చేశారు. కామిక్సు, పజిల్సు, బొమ్మల కథలను ఆదివారం ప్రోత్సహిస్తూ వచ్చారు.

## అనుబంధాలు :

1980-1990 మధ్య కాలంలో వచ్చిన దిన పత్రికలు ప్రాంతలవారీ ఎడిషన్లను ప్రచురిస్తూ వచ్చాయి. అంతర్జాతీయ వార్తలకు, జాతీయ వార్తలకు ప్రాతినిధ్యం తగ్గించి, ప్రాంతీయ వార్తలకు ప్రాతినిధ్యం ఎక్కువ కల్పించారు. క్రయిం, కోర్టులు, పోలీసులు, ఎక్కువగా వార్తలలో కనిపిస్తున్నారు. రేపులు, గాంగ్ రేపులు, పోలీసులు సృష్టించే బీభత్సం, దొంగతనాలు, ప్రమాదాలు వీటినే పాఠకులు ఆసక్తితో ముందు చదువుతారు. అసలు ముఖ్య పత్రికకు తోడపెళ్ళి కూతుర్లా అనుబంధాలను ముద్రించడం, వారం పొడుగునా ఏదోఒక సప్లిమెంటును తీసుకురావడం యిటీవల ఫ్యాషనైంది. పత్రికల మధ్య పోటీ, ఒకరిని చూసి ఒకరు అనుకరించడం ఎక్కువయింది. విజయాన్ని అనుకరించినంత మాత్రాన విజయాలు రావు. ఒకర్ని అనుసరించడం దాస్యమే.

## రంగులయుద్ధం :

నేటి తెలుగు దిన పత్రికలు రంగులతోరణాల్లా ఇంద్రధనుస్సుల్లా కిలాడీ రమణుల్లా వుంటున్నాయి. ఈ రంగుల ముద్రణ, స్కానింగ్ చాలా ఖరీదైన వ్యవహారం. అయినా పట్టు బట్టిన విక్రమార్కుల్లా విడవకుండా ఒకర్ని మించి ఒకరు ఈనాడు, ఉదయం, ఆంధ్రజ్యోతి యీ వర్ణసంగ్రామంలో పోటీపడుతున్నాయి. వీరు ప్రకటించే అనుబంధాలు (సప్లిమెంట్లు) బావుంటున్నాయి గాని వాటిలో ఒక ప్రాంతంలో ఒక చోట ఒక వూళ్ళో జరిగిన సంగతి వార్త విశేషం సంఘటన మరో ప్రాంతానికి తెలియటం లేదు. ఒక పత్రిక ఒక రాష్ట్రాన్ని జిల్లాలవారీగా ప్రాంతాలవారీగా విభజించి పంచుకుంటున్నది. చిత్రం ఏమిటంటే సమగ్రమైన వార్తాపత్రిక ఈనాడు లేదు.

# ఈ దశాబ్దంలో ప్రసారకళలు

—శ్రీ శాంతిస్వరూప్

గతం
చరిత్ర స్వగతం;
భవిష్యత్తు -
భృకుటి కెక్కని మత్తు;
వర్తమానం :
వజ్రాలతో సమానం !
వాటి ననుభవించే దిక్కు ! !
అందరికీ అందివచ్చే హక్కు ! ! !

మబ్బుతునకలో వున్నా
వాన చినుకులో వున్నా
నీటి తడి లక్ష్యం,
నేలఒడి గమ్యం !
పుడమి సారం -
పెంచిన
ధార ధన్యం ! ! !

- నేను 'గాజుతెర' మనిషిని -

నేను ఈ రెండు కవితల్ని వుదాహరించడంలో అంతర్లీనంగా వున్న భావం-వర్తమానంలో ప్రస్తుతం, ప్రభావ భరితంగావున్న ప్రసారకళ (సాధనం) గురించి వుటంకించటమే ! ఒక ప్రాకారాన్ని పరికించి, పరిశీలిస్తున్నప్పుడు, గోపురంనుంచీ, గోతులదాకా. చూరు నుంచి, పునాది లోతులదాకా అవలోకించడం సముచితం - అని నా అభిప్రాయం ! ఆ ప్రాకారమే ప్రసార కళ ! ప్రసార కళల్లో - మౌలికంగా నాలుగు మాధ్యమాలు మనం లెక్కలోకి తీసుకోవచ్చు. వీటి ప్రాతిపదిక :

1. సజీవ ప్రదర్శన (Live Presentation)
2. ప్రేక్షకుల సామీప్యం (Audience Contact)
3. ప్రభావ పటిమ (Effectiveness)
4. సాంకేతిక విజ్ఞత (Technical Excellence)

ఈ కొలమానంతో వర్గీకరిస్తే, నాలుగు స్థాయిల్లో నాలుగు మాధ్యమాలు మనకు కనపడతాయి-

1. నాటకం
2. రేడియో
3. సినిమా
4. దూరదర్శన్ (మరీ దూరంగా వుందనిపిస్తే) టి. వి.

గతదశకంలో-

ఒక్కొక్క మాధ్యమంలో ప్రభవించిన మార్పుల్ని, మలుపుల్ని గమనిద్దాం - క్లుప్తంగా-

## నాటక రంగంలో :

దాదాపు 'స్తబ్ధత' ఆవరించింది. - అనొచ్చు - కారణాలు - కోటి - ఆర్థికంగా అనాదరణ, కళాకారులకు, ఇతర "లాభకర రంగాల్లో" మోజు పెరగటం. ఇందాక అనుకున్న నాల్గు కొలమానాల్లోనూ నాటకరంగానికే ప్రథమ స్థానం - అంటే పునాది నుంచీ, ఇంటి ఎత్తు కొల్చినట్టు! కాని, ఉప్పెనలా వస్తున్న ఇతర సాధనాల తాకిడిని తట్టుకోలేక, గాలివాటుకి విరిగిన కొమ్మలా, పక్కకు తొలిగింది. అయినా ఇప్పటికీ మారుమూల పల్లెలతో పాటు రాజధానిలో "వీధి నాటకాలు" స్వర్గీయ హష్మీ నుంచి విశ్వవిద్యాలయ నాటక విభాగం వారి వరకూ, కొద్దోగొప్పో ఆడుతున్నారు - ఇంకా 'జీవం' వుందని నిరూపించటానికి నాటకరంగం అస్తిత్వం గురించి ఆలోచిస్తే ఒకప్పుడు - సజీవ స్రవంతిలా వుండే ఈ ప్రసార కళ ఇప్పుడు - మరో నదికి, ఉపనదిలా రూపాంతరం చెందింది. ప్రముఖంగా ఈ వలసంతా టీవీ వైపుకే! కళాకారులనీ తప్పుపట్టలేం, ప్రేక్షకులనీ దోషులనలేం! కాల ప్రభావం! అయితే ఈనాటికీ, ప్రభుత్వం శాఖ సాంగ్ అండ్ డ్రామాడివిజన్ వారు, ప్రచారం కోసం, ఈ నాటక రంగాన్ని వాడుకోవటం - గమనార్హం!

రూపవాణి అన్న పేరుతో రాష్ట్రంలో నలుమూలల ప్రదర్శనలు ప్రజా రంజకంగా నిర్వహించిన ఉదంతం నాటకరంగం చరిత్ర పుటలో శాశ్వతంగా మిగిలిపోతుంది. ఈ ప్రయోగం ఈ రంగంలో సాధించిన సాంకేతిక విజ్ఞతకి ఒక ప్రతీకగా చెప్పుకోవచ్చు. (గతంలో ఓ 20 ఏళ్ళ క్రితం మాలపల్లె నాటకాన్ని శ్రీ ఎ. ఆర్. క్రిష్ణ ఈనాటి చిత్ర తారలు ఆనాటి రంగస్థల మేటి నటులతో ప్రదర్శించారు.)

'రిపర్టరీ' వంటి నట శిక్షణాలయాలు పూర్తిగా మూత పడిపోవటం తెలుగు నాటకానికి పరోక్షంగా తెరదించినట్టే! అయితే నాటకాలపట్ల అభిలాష, అభిమానం ఇప్పుడు కేవలం కళాశాలలకీ, 'ప్రభుత్వరంగ సంస్థలు ఆర్థిక సహాయం అందచేస్తున్న ఔత్సాహిక సంస్థలకి పరిమితం అయిపోయాయి. ఇలా ఒకనాడు మహోజ్వలంగా ప్రజ్వరిల్లిన ఈ నాటక జ్యోతి ఈనాడు ప్రమిదలో చమురు కరువై ఒత్తి కొడిగడుతున్న దీపంలా మిగిలి పోయింది.

నాటకరంగం తరువాత ప్రజలకు సన్నిహితంగా వెళ్ళిన ప్రసార సాధనం 'రేడియో'. 50 ఏళ్ళ విజయవంతమైన చరిత్రగల ఈ ప్రసార మాధ్యమం గత దశాబ్దంలో పొగచూరుకు పోయిందని చెప్పొచ్చు. శ్రోతలతో ప్రత్యక్ష సంపర్కాలు కేవలం కంఠస్వరం ద్వారా మాత్రమే ఏర్పరుచుకొని వారి సామాజిక జీవన సరళిలో భాగస్వాములై పోయిన కళాకారులు ఎంతోమంది ఉన్నారు. అయితే, గత 10 ఏళ్ళలో ఈ కళాకారుల శక్తి సామర్థ్యాలలో ఏమాత్రం లోటు, లోపాలు లేకపోయినా ఈ ప్రసార కళకి వీస్తున్న ఎదురు గాలి వల్ల కొన్ని శతాబ్దాల వెనక్కి నెట్టివేయబడ్డట్టుగా జ్ఞాపకాల పొరల్లో ఇమిడి పోయారు. రేడియో సామాజిక స్పృహను కల్గించటంలో, సుదూర ప్రాంతాలలో వున్న గ్రామీణులకు ప్రపంచ పరిజ్ఞాన చైతన్యాన్ని కలిగించటంలో నూటికి 90 శాతం కృతకృత్యురాలు అయినప్పటికి ఈ ప్రసార కళకి వున్న సాంకేతిక పరిమితివల్ల ఇది మనమిచ్చుకున్న నాలుగు కాలమానాల్లో రెండింటిని అంటే సజీవ ప్రదర్శనని ప్రేక్షకుల సామీప్యాన్ని సాధించినా ప్రభావ పటిమ తగ్గి (గతంలో ఇది పోటీలేని ప్రసార సాధనంగా ఉందన్న విషయం మనం మననం

చేసుకోవాలి) ఈనాడు రెండవ స్థాయి ప్రసారకళగా మిగిలిపోయింది. సాంకేతికపరంగా ఎఫ్. ఎమ్. రేడియో అని కొన్ని క్రొంగొత్త ప్రయోగాలు ఆచరణలో పెట్టటంవల్ల ఈ ప్రసార సాధనం విస్తరణ (సమాంతర) వైశాల్యం పెరిగినప్పటికి దీని ప్రభావం స్థాయి తగ్గిందని చెప్పాలి. అయినా ఈ నాటికీ ఈ మాధ్యమంలోని కళాకారుల గుర్తింపుకు గతంలో కలిగిన శాశ్వితత్వం తరగ లేదు. పాత అనుభూతుల పరిమళాలు ఇంకా శ్రోతల్ని ముగ్ధుల్ని చేస్తూనేవున్నాయి. రేడియో గత దశాబ్దకాలంలో ఎదుర్కొన్న ఎదురీతవల్ల ఈనాడు ఒక వినోద సాధనంగా రూపాంతరం చెందింది. సినిమా పాటలు వినడానికి లేదా వార్తలు వినటానికి. (అది టి. వి. అందుబాటు లేని స్థలాల్లో)

'సృష్టించిన మొదటిరోజు నుంచి ప్రేక్షకుల మీద అత్యంత ప్రభావాన్ని చూపించిన ప్రసార ప్రచారసాధనం 'సినిమా'. సాంకేతికంగా ఎన్నో మార్పులు చెందుతూ ఈనాడు ప్రజలకి వయస్సుతో సంబంధం లేకుండా ఆకర్షణ యంత్రంగా పనిచేస్తున్న ప్రసారకళ ఇది. గత దశాబ్దంలో ఈ కళ, ప్రత్యేకించి చేపట్టిన ఇతివృత్తాల కారణంగా కొంతవరకు కొన్నివర్గాల ప్రేక్షకులకే పరిమితమైదని చెప్పాలి. 70 ఎమ్. ఎమ్., సినిమాస్కోప్, స్టీరియో ఫోనిక్ సౌండ్, మల్టీట్రాక్ స్టీరియో మొదలైన సాంకేతిక విజ్ఞతతో, ధనార్జన లక్ష్యంగా పెట్టుకొని, హింసని, దౌర్జన్యాన్ని ఆధారం చేసుకొని కొన్ని చిత్రాలు తయారవుతే, విదేశీ చిత్రాలను అనుకరిస్తూ ప్రేక్షకుల్ని ఆకర్షించటానికి మరొక వంక సెక్స్ చిత్రాలు విడుదలై ప్రేక్షక రంగాన్ని వర్గీకరించాయి. అయితే కొన్ని కళాత్మక చిత్రాలుకూడా రాకపోలేదు. వీటి సంఖ్య 10 కూడా దాటి ఉండలేదు. ఏది ఏమైనా ఈ ప్రసార కళకూడా గత దశాబ్దంలో ఎదుర్కొన్న తీవ్రమైన సమస్య ప్రతిఘటన! (టి. వి.)!!! ప్రేక్షకులతో సినిమా కళాకారులు సాంకేతిక నిపుణులు ఈమాధ్యమంద్వారా సాన్నిహిత్యాన్ని ఏర్పరచుకున్నా టి.వి. రాకతో ప్రేక్షకులు ఒక విధమైన సందిగ్ధంలో పడ్డారని చెప్పాలి.

తనకు నచ్చిన ఒక సినిమా చూడటానికి ప్రేక్షకుడు ముందుగానే ఆ థియేటర్‌కు వెళ్ళి క్యూలో నిలబడి టికెట్టు కొనుక్కొని మూడు గంటలసేపు కదలకుండా హాల్‌లో మానసికంగా, భౌతికంగా బందీయై ఈ కళా విందును

ఆరగించాల్సి వస్తుంది. అదే ఈ కళకి పోటీగా విస్తరించిన దూరదర్శన్ ప్రేక్షకుడి ఇంట్లో ఒక సభ్యుడిగా ప్రేక్షకుడి ఇంటి పనులకు ఏమాత్రం ఆటంకం కాకుండా ఆనందాన్ని కలిగించడం ప్రేక్షకుడి పట్ల ఒక వరంగా ఉద్భవించింది. మరికాస్త మోటుగా చెప్పాలంటే వెలబెట్టి కొని వెళ్ళవలసిన వెలయాలు సినిమా ఐతే - తాళి కట్టకుండానే అందివచ్చిన అప్సరస వంటిది ఈనాడు ప్రతి ఇంట వినోదాన్ని, విజ్ఞానాన్ని పంచుతున్న దూరదర్శన్. సినిమా, దూరదర్శన్ ప్రస్తుత కాలంలో సమాంతరంగా పోటీ పడుతున్న ప్రసార కళలు.

గత దశాబ్దంలో దూరదర్శన్ విస్తరణ ప్రభావం, దానికి తోడుగా కవల పిల్లలుగా పుట్టిన వీడియో, సినిమాని ఒక వ్యాపారంగా నిలదొక్కుకోవటంలో దెబ్బతీసాయి. అయితే ఈనాటికీ సినిమా ఒక ప్రసార కళగా తన ప్రభావాన్ని ఏమాత్రం కోల్పోలేదనే చెప్పాలి. సినిమాతో పోలిస్తే దూరదర్శన్ సాంకేతికంగా ఎన్నోరెట్లు ఎదిగిందని చెప్పవచ్చు.

1982లో ప్రారంభం అయిన ఉపగ్రహాల వినియోగం (అంతకుముందు 1975, 76లో ప్రయోగాత్మకంగా సైట్ కార్యక్రమాలను అమెరికా ఉపగ్రహం ఏటిఎస్ - 6తో నిర్వహించారు). సువిశాలమయిన ఈ భూమండలాన్ని ఒక పిడికెడు ప్రపంచంగా మార్చివేసింది. లైవ్ఎయిడ్, మెక్సికో ఒలంపిక్స్, ఐదు ఖండాల ప్రధానమంత్రుల ప్రత్యక్ష సమావేశం వంటి చారిత్రాత్మకమైన సంఘటనలని మన ఇంట్లో భోజనం బల్లదగ్గర కూర్చొనో, మంచంమీద పడుకునో, పూర్తి విశ్రాంతితో చూడగలిగే అనూహ్యమైన, అద్భుతమైన అనుభూతిని అందించింది దూరదర్శన్. వీటివల్ల ఈ ప్రసార సాధనం సాంకేతిక విజ్ఞతని అత్యంత ఉన్నత ప్రమాణంలో ప్రదర్శిస్తూ తన సజీవ ప్రత్యక్ష ప్రసారాల ద్వారా ప్రేక్షకుల సామీప్యాన్ని అధిక శాతం సాధించింది.

కేవలం ఒక్క దశాబ్ద కాలంలో దూరదర్శన్ నలుపు - తెలుపుల నుంచి రంగుల్లోకి, ఉపగ్రహాల వాడకాన్ని, తద్వారా రాష్ట్రంలోని మారుమూలకి ప్రసారాన్ని అందచేయగలిగే పరిణతిని ప్రేక్షకులకు రుచి చూపించింది. (అదే నలుపు తెలుపు సినిమా రంగుల్లోకి మారడానికి పాతికేళ్ళ పైగా పట్టింది) అందువల్ల ఈ ప్రసార సాధనం ప్రదర్శించిన ప్రభావ పటిమ కారణంగా ఈ

ప్రసారకళని ఆధారం చేసుకుని ఈ మాధ్యమాన్ని వాడుతున్న కళాకారులు ప్రేక్షకుల హృదయాలలో ఒక సన్నిహిత స్థానాన్ని సంపాదించుకుంటున్నారు.

టి.వి.లో కనపడే వ్యక్తిని ప్రేక్షకులు తమ కుటుంబంలో ఒక సభ్యుడిగా అభిమానిస్తారు. ఆత్మీయత ప్రదర్శిస్తారు. అదే ఓ సినిమా కళాకారుడు కనపడితే అతనిపట్ల ప్రేక్షకులకి మనసులో ఉండే భావం అతను నటించే పాత్రను బట్టి ఆరాధన కానీ తెలియని అవహేళనని గానీ కలుగచేస్తాయి. ఈ ఆత్మీయతకీ, ఆ ఆరాధనాభావానికీ మధ్య అంతరం ఒక తరం అంత ఉంటుంది. ప్రస్తుతం ప్రతి ఇంట్లో, ప్రత్యేకించి మధ్య తరగతి కుటుంబీకుల్లో అత్యవసర వస్తువుల్లో ఒకటయిన టి.వి ఒక అత్యంత ఆత్మీయ ప్రసార కళకు విశాలమయిన వేదిక. నాటక రంగంలో అనుభవం ఉండి ఆదరణ లేని నిష్ణాతులు, సినిమారంగంలో నుంచి ఈ నూతన ప్రసార సాధనం పట్ల ఆసక్తి చూపిస్తున్న కళాకారులు సాంకేతిక నిపుణులతో ఈ ప్రసారకళ మరింత పటిష్ఠంగా రూపొందుతోంది.

ఈ ప్రసార కళలో ప్రత్యేకంగా నైపుణ్యం సాధించిన వారు వారి వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవటమేకాక ప్రేక్షకుల హృదయాల్లో కుటుంబ సభ్యులతో సమానమయిన సాన్నిహిత్యాన్ని అభిమానాన్ని చూరగొంటున్నారు. ఈ ప్రసార సాధనం మనం ముందుగా ఎంచుకొన్న నాలుగు కొలమానాల ప్రకారం ఉత్తమమయినదిగా నిలుస్తుంది. అయితే ఇతర ప్రసార కళల్లో పాలు పంచుకొంటున్న కళాకారుల్లో తమశక్తి కొద్ది ప్రేక్షకులకి తాము చెప్పాలను కొన్నది చెప్ప గలిగింది చెప్తూనే ఉన్నారు.

నేను మొదట్లో ఉపహరించిన చిన్న కవితలోలాగా నీటి తడి ఎక్కడ ఉద్భవించి ఎలా ప్రవహించినా పుడమిసారాన్ని పెంచటమే లక్ష్యమయినట్లు ఆధునికమైన ఈ ప్రపంచంలో ఏ ప్రసారకళను ఎన్నుకొన్నా ప్రేక్షకుల సంతృప్తి సాధనే, ఆ కళ సార్థకతకు తార్కాణం. గతంలో వైరాగ్యాలు రెండు రకాలే అనేవారు. ప్రసూతి వైరాగ్యం, స్మశాన వైరాగ్యం. ఇప్పుడు వాటికి తోడు 'ప్రసార వైరాగ్యం' కూడా జతకడుతుందేమో నన్న అనుమానం రాకుండా ఈ ప్రసార కళలు ప్రసవించే (ప్రభవించే) తీరు ఈ నూతన అధ్యాయం పట్ల రానున్న అనతికాలంలో అశేష ప్రేక్షక హృదయాలకు "స్పందన" అంతటి దగ్గరవుతాయని ఆశిస్తున్నాను.

# ఈ దశాబ్దంలో సాహిత్య విమర్శ

—డా॥ కోవెల సంపత్కుమారాచార్య

వాస్తవానికి తెలుగులో ఒక ప్రత్యేక ప్రక్రియగా సాహిత్య విమర్శ 1892 లో పి. దక్షిణామూర్తి రచించిన 'పింగళి సూరన'తో ఆధునికంగా ఆరంభమయింది. అచ్చంగా శాబ్దికాది చర్చల సంక్లిష్ట వివిధ జాలాలనుంచి, వైయక్తిక వైమనస్యాల ప్రేరణలనుంచి, 'ప్రతిశీలన' విధానాల నుంచి క్రమ క్రమంగా తప్పించుకొని విషయపర వివేకంతో, అనుశీలన విధానంతో, ఆరోగ్య కరమయిన వివేచనా భూమికమీద అవతరించిన తొలి ఆధునిక విమర్శ గ్రంథం ఈ 'పింగళి సూరన' కాగా, మరో రెండేళ్ళలో తెలుగులో సాహిత్య విమర్శ వందేండ్ల పండుగ జరుపుకోవటానికి అన్ని విధాలా సమాయత్తమవుతున్నది; పదో పది పూర్తి చేసుకొంటున్నది. ఈ వందేండ్లలో సాహిత్య విమర్శ తెలుగులో రకరకాల బారుల్లో, తీరుల్లో సాగింది. ఇతరమయిన వివిధ విమర్శన రీతులతో స్నేహబాంధవ్య సంబంధాలు సంపాదించుకొంది; పెంచుకొంది. అయితే; ఈ పది పదుల గణనీయమయిన కాల పరిక్రమణంలో ఎన్నెన్ని విధాల విమర్శలు వ్యాసాల రూపంగా, వ్యాస సంకలనాల రూపంగా, గ్రంథాలుగా వచ్చాయో, ఎన్నెన్ని పత్రికలు, సంచికలు, ప్రత్యేక సంచికలు మొదలయినవి సాహిత్య విమర్శకు అంకిత మయ్యాయో, ప్రాధాన్య మిచ్చాయో, ఆదరణ - ప్రోత్సాహం కలిగించాయో - ఈ మొదలయిన అన్నింటినీ చెప్పుకోవటం సులభం కాకపోవ టమే కాదు; అసాధ్యం కూడా నేమో!

అయితే, ఇటీవల ఎస్. వి. రామారావు వెలువరించిన 'తెలుగులో సాహిత్య విమర్శ'(ద్వితీయ-పరివర్ధిత ముద్రణ; 1989) చాలావరకు సమాచారాన్ని సంపా దించి పెట్టింది; కొంత సౌకర్యం సౌలభ్యం కలిగించింది కాని, ఆ గ్రంథానికి అందనివి అసలే లేవని చెప్పటానికి సాహసం చాలదు. ఇట్లాంటి విషయంలో

ఎంత చేసినా, ఎంతో కొంత మిగిలిపోతూనే ఉంటుంది. మరి, మొదటి నుంచీ ఏ పదేళ్ళకయినా ఒకసారిగా విస్తృతంగా సమాచార సేకరణా, సమీక్షా సాగి ఉండి ఉంటే, మరికొంత అధికంగా సమాచారం దొరికి ఉండేదేమో! ఒకప్పుడు శ్రీవాత్సవ- ఒక్కొక్క సంవత్సరంలో వచ్చిన వివిధ సాహిత్య ప్రక్రియా గ్రంథాలను సమాచార పూర్వకంగా సమీక్షిస్తూ ఉండేవారు. ఆయన తరువాత గూడా ఒకరిద్దరు మరొకటి రెండుసార్లు అట్లే చేయకపోలేదు. ఆంధ్ర పత్రిక ఉగాదిసంచికలు, తెలుగు స్వతంత్ర ఇందుకు ఎంతగానో ప్రోత్సాహం కలిగించాయి. ఆ తరువాత ఈ పద్ధతి ఏ కారణంవల్లనో తెలియదుగాని- ఆగిపోయింది. అయితే; ఈ విధమయిన సమీక్ష లేదా పరిచయం అనేక ప్రక్రియల్లో వచ్చిన వివిధ రచనలకు సంబంధించింది కావటాన ఏ ఒక్క ప్రత్యేక ప్రక్రియకు చెందిన రచనలను ఉన్న పరిమితుల్లో నయినా గాఢంగా సమీక్షించే అవకాశం చాలా తక్కువే అనిపించేది. అదట్లా ఉంచి, సమాచారం లభించినా గూడా అసలు వ్యాసాలూ, గ్రంథాలూ, మొదలయినవి లభ్యం కావటం సులభం కాదు. ప్రస్తుత దశాబ్ద విషయం గూడా ఇందుకు అపవాద మేమీకాదు. అయినా, దాదాపు చివరి దాకా వచ్చిన ఈ దశాబ్దంలో సాహిత్య విమర్శ తీరుతెన్నులను- ఆయా పరిమితులను బట్టి స్థూలంగానే కావచ్చుగాని, గుర్తించుకోవటం ప్రస్తుతానికి ఎంతోకొంత సహకరించ వచ్చుననే తాత్పర్యమే పరిచయాత్మకంగా, రేఖాప్రాయంగా ప్రయత్నిస్తున్న ఈ వ్యాసానికి పునాది.

సౌకర్యాల విషయం అట్లా ఉంచి, ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్య విమర్శకు ప్రధానంగా ఇబ్బంది కలిగించిన విషయం— విమర్శను విస్తృత ప్రాతిపదిక మీద, వివిధ దృక్పథాలకూ, రీతులకూ, విధానాలకూ అవకాశమిచ్చి ప్రచురించి వ్యాప్తికి తెచ్చే శక్తి యుక్తులూ, సౌకర్యాలూ గల పత్రికలు లేకపోవటం. సాహిత్య విమర్శకు తొలి దశాబ్దాల్లో అండగా ఉండిన పత్రికలు చాలానే వచ్చినాయి. కొద్ది కాలమే సాగినా అవి విమర్శకు కలిగించిన ప్రోత్సాహం స్మరణీయమయింది. మరి గత దశాబ్దాల్లో ఒకే ఒకటిగా మిగిలిపోయిందే అయినా 'భారతి' (మాసపత్రిక) విమర్శ ప్రచురణకూ వ్యాప్తికీ, వివిధ విమర్శ రీతులకూ పెద్ద దిక్కుగా ఉండేది కాని, ఈ దశాబ్దంలో అంతటి మాసపత్రికా ఆగిపోయింది.

అప్పుడప్పుడన్నట్టుగా ఆగుతూ, సాగుతూ, ఆగుతూ ఉన్నందువల్ల కథ, నవలా, కవిత్వం వంటి ఇతర సాహిత్య ప్రక్రియల కన్నింటికన్నా సాహిత్య విమర్శకు దాని విస్తృతికీ, వ్యాప్తికీ సరయిన పట్టు చిక్కకుండా పోయింది. భారతికి ఉండి ఉండే శక్తియుక్తులు గానీ, సౌకర్యాలు గానీ, వ్యాప్తిగానీ 'స్రవంతి' (మాస పత్రిక)కి లేవు. అది దక్షిణ భారత హిందీ సభా పత్రిక. ఎంతోకొంతగా అది సహకరిస్తూనే ఉన్నా గూడా ఎప్పటికప్పుడు సాహిత్య విమర్శకు పెరుగుతున్న అవసరాలను అది ఒంటరిగా తీర్చలేక పోతున్నది. నిజానికి ఏ ఒక్కటీ ఇందుకు సరిపోదు. చాలా కాలంగా ఆగిపోయిన 'అభ్యుదయ'- అభ్యుదయ రచయితల సంఘం పత్రిక, ఈ దశాబ్దంలో నిలదొక్కుకోవటానికి ప్రయత్నిస్తూ సాగుతూ వస్తున్నది. దాని పరిమితులూ, పరిధులూ ఎన్ని ఉన్నా ఈ దశాబ్దంలో కవిత్వం, నవల, సాహిత్య విమర్శలకు సంబంధించి సమీక్షాత్మకమయిన ప్రత్యేక సంచికలు వెలువరించింది. 'సృజన' ఆధునిక సాహిత్య వేదికగా ఆరంభమయినా గూడా విప్లవ రచయితల సంఘం ఏర్పడ్డాక దాని పరమయి పోయింది. అరుణ తార విరసం పత్రికగానే అవతరించింది. ప్రస్తుతం చెప్పుకోవటానికి ఇవి సాహిత్య మాస పత్రికలే కావచ్చు గాని, రాజకీయంగా ఈ పత్రికలన్నీ అతివాద, మితవాద తీవ్ర వామపక్షాలూ, చీలిన వాటి వర్గాలూ వెన్నుదన్నుగా సాగుతున్నవే. అందువల్ల వాటిలో వెలువడే సాహిత్యం గానీ, సాహిత్య విమర్శగానీ ఆయా పక్షాలకూ వర్గాలకూ పరిమితమయిపోయి, వాటి భావజాల ప్రచారానికి అంకితమయి పోయినవి. ఈ కారణంగానే కావచ్చు; వాటి వ్యాప్తి చాలా పరిమితమయి పోయింది. వాటి తీరు పాక్షికం. ఆయా వర్గాల్లోనే వాటికి ప్రచారం కారణంగా వాటిలోని సాహిత్యం, విమర్శ ఎక్కువ మందికి అందుబాటులోకి వచ్చే అవకాశం సహజంగానే తక్కువయి పోయింది. ఈ తీరుకే చెందిన జన సాహితి వంటి పత్రికలు నిలదొక్కుకోనే లేదు. కాగా, విస్తృత ప్రాతిపదిక మీద వివిధ రీతుల్లో సాగే సాహిత్య విమర్శ అవసరాలను తీర్చే అవకాశం గానీ, శక్తియుక్తులు గానీ, సౌకర్యాలు గానీ వాటికి లేవు. వాటి మౌలిక - ఉద్దేశ్యాలనూ, పరిమితులనూబట్టి వాటి ఈ విధమయిన ప్రవృత్తిని అర్థం చేసుకోవచ్చు. అయితే, ఈ దశాబ్దంలో తెలుగు అకాడమీ 'తెలుగు' మాస పత్రికను వెలువరించటం ఆరంభించింది. మొదట్లో మూడు నెలల పత్రికగా

ఆరంభమయి, ఇటీవలి సంవత్సరాల్లో మాస పత్రికగా వస్తున్నది. ఇందులో తెలుగు సాహిత్య విమర్శకు ప్రత్యేకంగా ప్రాధాన్యం కన్పిస్తుంది. చాల మంది ప్రసిద్ధ విమర్శకుల వ్యాసాలను ఇది వెలువరుస్తున్నది. అయితే ఇవి అచ్చంగా తెలుగు సాహిత్యానికి మాత్రమే పరిమితం కాదు. వివిధ శాస్త్రవిభాగాలకూ చెందింది. ఆ కారణంగా దీనివల్ల కలిగే ప్రయోజనంగూడా పరిమితము కావటం సహజమే. కాగా, ఈ స్థితిలో దిన - వార పత్రికలు సాహిత్యాన్నీ, సాహిత్య విమర్శనూ ఆదుకోవాల్సిన అవసరాన్ని గుర్తించి అందుకు అవకాశాలు కల్పించటం ఈ దశాబ్దంలో ప్రత్యేకంగా గమనించవచ్చు. గత దశాబ్దాల్లో కన్నా ఇప్పుడు అవి ఇస్తున్న చేయూత అధికం. అయితే, ఆయా పత్రికల స్వరూప స్వభావాలను బట్టి వాటి వాటి పరిమితులూ, పరిధులూ, అవకాశాలూ, ప్రయోజనాలూ వాటి వాటి కున్నాయి. ఆయా పరిమితుల్లోనే అవి ప్రవర్తించవలసి ఉంటుంది. కాగా, సాహిత్య విమర్శకు ఆయా దిన - వార పత్రికలు కలిగించే అవకాశం కూడా ఆ పరిమితులను బట్టే ఉంటుంది.

ఇటీవల దాదాపుగా దినపత్రికలన్నీ వారంలో ఒక రోజు - సామాన్యంగా సోమవారమో, శనివారమో, ఒక పేజీ మొత్తం సాహిత్యానికి కేటాయిస్తున్నవి. కొన్ని పత్రికలు ఆదివారం నాడు గూడా కొంత అవకాశాన్ని కలిగిస్తున్నవి. వీటిలో సాధారణంగా విమర్శకూ, ఆ తరువాత కవితకూ స్థానం లభిస్తున్నది. కాగా ఈ పత్రికల్లో వారాంతరబడిగా సాహిత్య విమర్శ ధారావాహికంగా వెలువడుతుండటం ఈ దశాబ్దంలో ఒక విశేషంగా గమనించవచ్చు. సాహిత్యవిమర్శ ధారావాహికంగా వెలువడటంలో రెండు విధానాలు ఉన్నాయి. ఒక విధం : సాధారణంగా ఏ వారానికి ఆ వారమే ఏదో ఒక విషయంపై విమర్శ సాగించటం. రెండోవిధం: ఒక విస్తృతవిషయాన్ని నిర్దేశించుకొని దాన్నికొన్ని అంశాలుగా వింగడించి ఒక క్రమానుస్యూతితో విమర్శ సాగించటం. కచ్చితంగా చెప్పేతే, ఈ రెండోవిధమే ధారావాహిక విమర్శ. మొదటి విధానికి ఆంధ్రప్రభ ఆదివారం (దిన) పత్రికలో టి. ఎల్. కాంతారావు నిర్వహించిన 'కలాలు - సంకలనాలు' అనే శీర్షికనూ, కె. వి. రమణారెడ్డి నిర్వహించిన 'ఆధునిక భారతీయ సాహిత్య కర్తలు' అనే శీర్షికనూ చెప్పుకోవలసి ఉంటుంది. కాంతారావు ఒక్కొక్కవారం

ఒక కావ్యాన్నో, కవితా సంకలనాన్నో, కథనో, కథా సంకలనాన్నో, నవలనో .... తీసుకొని విమర్శ సాగించారు. అయితే, ఈ యీ రచనలను ఎన్నుకోవటంలో గానీ, క్రమాన్ని పాటించటంలో గానీ ఏదో ఒక నిర్దిష్ట సూత్రాన్ని అనుసరించినట్లు కన్పించదు. ఏ రచన చేతికందితే, అందుబాటులో ఉంటే దాన్ని గూర్చే రాస్తున్నట్టు కన్పిస్తుంది. ఈ రకమయిన విమర్శ విధానంలో గ్రంథ పరిచయ సమీక్షా లక్షణమే ప్రధానం. రమణారెడ్డి ఆధునిక సాహిత్య నిర్మాతలుగా ప్రసిద్ధులయిన బంకించంద్రుడు, రవీంద్రుడు, కందుకూరి వంటి వివిధ భారతీయ భాషలకు చెందిన వారినిగూర్చి, వారి రచనా నేపథ్యాన్నీ, రచనల తత్వాన్నీ తమ ధోరణిలో విమర్శించి చూపించారు. ఒక నిర్దిష్టమయిన దృక్పథం, ప్రయోజనం ఈ విమర్శలో కన్పిస్తుంది. కాంతారావు, రమణారెడ్డి— ఈ ఇద్దరి విమర్శ ధోరణీ మార్క్సిస్టు విమర్శనారీతికే చెందిందయినా, ఈ తీరులో రమణారెడ్డి కృతహస్తుడనేది ప్రత్యేకించి కొత్తగా చెప్పవలసిందేమీ కాదు.

ఆంధ్రజ్యోతి ఆదివారం (దిన) పత్రికలో చేకూరి రామారావు నిర్వహించే 'చేరాతలు' గూడా ఈ తరహాకు చెందినదే. ఈ రాతల్లో వివిధ సాహిత్య ప్రక్రియలకు చెందిన రచనలేకాక, భాషాచ్ఛందోలంకారాది విషయాలూ, కవులూ, రచయితలూ వస్తూనే ఉంటారు. 'శీర్షికారచనా' విధానంలో సాగే ఈ విమర్శలో లోతుకన్నా వెడల్పు ఎక్కువగా ఉండటం సహజమే. రామారావు సాగించే విమర్శ తరహాకూడా మార్క్సిస్టు ధోరణికే చెందిందయినా, కొన్ని చోట్ల నిర్మాణవాదం (Stucturalism) వైపూ, అనుభూతివాదంవైపూ మొగ్గుతున్నట్లు కన్పిస్తుంది. ఏదో విధంగా పాఠకులను సాహిత్యాభిముఖులను చేయటానికంటూ ఈ తరహా 'సులభ' విధానం అవలంబించటంవల్ల ఈ రకమయిన వ్యతిక్రమాలు అప్పుడప్పుడూ చోటు చేసుకోవటమూ సహజమేనేమో ననిపిస్తుంది. 'చేరాతలు'లో వివాదాలు పెంచే లక్షణంగూడా ఈ తీరునే స్ఫురింపజేస్తుంది. ఇక, రెండో విధానానికి ఆంధ్రప్రభ ఆదివారం (దిన) పత్రికలో జి. వి. సుబ్రహ్మణ్యం నిర్వహిస్తున్న 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' గమనించవచ్చు. తెలుగు సాహిత్య చరిత్రనుగూర్చి విచారించేప్పుడు అనేకాంశాలు చర్చనీయాలుగా కన్పిస్తయి. ఉదహరణకు వస్తు కవిత, జానుతెనుగు, ప్రబంధం వంటివి ఈ నాటికీ చర్చనీయంగానే ఉన్నయి. కాగా, తెలుగు సాహిత్య క్రమ పరిణామాన్ని

సమన్వయ పూర్వకంగా సమాలోచిస్తూ, ఆదినుంచి ఈ నాటివరకూ సాగిన వివిధ సాహిత్య ప్రక్రియలూ, కావ్య,సాహిత్య, విమర్శ దృక్పథాలూ సిద్ధాంతాలూ వివిధ ప్రభావాలూ సుబ్రహ్మణ్యం ఈ ధారావాహిక విమర్శలో లోతుగానూ విస్తృతంగానూ సమాలోచిస్తున్నారు.నిర్ణయాలు చేస్తున్నారు. వీటివిషయంలో అభిప్రాయ భేదాలకు అవకాశం ఉండనే ఉన్నది. కొన్ని అంశాలగూర్చి వాదోప వాదాలూ, సాగినయికూడా. అదట్లా ఉంచి సుబ్రహ్మణ్యం సాగిస్తున్న ఈ విమర్శకు దేశీయ విధానం పునాది. ఇతర విమర్శరీతుల ప్రభావాలూ, ప్రమేయాలూ ఉండవచ్చు గాని భూమిక మాత్రం మారదు. దేశీయమయిన సమన్వయాత్మక విమర్శ విధానం ఇక్కడ ప్రధానంగా గమనించవలసిన అంశం. అయితే, ఈ విధంగా దిన పత్రికల్లో వచ్చే విమర్శ తీరు గమనిస్తే, సాహిత్యవిమర్శలో 'పత్రికారచనా' విధాన ధోరణి కన్పిస్తుంది. చేరాతలూ, సుబ్రహ్మణ్యం వారం వారం కూర్చే శీర్షికలూ ఈ విషయాన్ని స్పష్టం చేస్తాయి. విమర్శకు 'పత్రికారచనా' విధానం ఈ దశాబ్దంలో అధికంగా అనువర్తించిందనిపిస్తుంది.

ఆంధ్ర సారస్వత పరిషత్తు 'సారస్వతవేదిక' ద్వారా సాహిత్య విమర్శకు గత దశాబ్దంనుంచి ఎంతో దోహదం కలిగిస్తున్నది. నేకొక విషయంపై పరిశీలనా - విమర్శనాత్మక ప్రసంగ వ్యాసాలను వివిధ విమర్శకులు సమర్పించటం, సంవత్సరం తర్వాత వాటిని గ్రంథంగా వెలువరించటం ఈ వేదిక ప్రణాళిక. ఈ ప్రణాళికలో భాగంగా ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్య వికాసం, ఆధునిక సాహిత్యంలో విభిన్న ధోరణులు, తెలుగులో తొలి సమాజ కవులు, నూరేళ్ళ తెలుగునాడు— వ్యాససంకలన గ్రంథాలు వెలువడినాయి. ఈ వ్యాసాలు రచించిన విమర్శకులందరూ ఒకే రకమయిన దృక్పథాలకు చెందినవారు కారు. అందుకని ఆయా విషయాలను గూర్చి వివిధ ధృకృథాలలో ఈవ్యాసాలు రచింపబడినాయి. ఈ వ్యాససంకలనా లన్నింటికీ సంపాదకీయ బాధ్యత కె. కె. రంగనాథాచార్యులు నిర్వహించారు. ఆయన ఈ సంకలనాలకు సమకూర్చిన సంపాదకీయ వ్యాసాలు మార్క్సిస్టు ఆలోచనా ధోరణిలో మొత్తం విషయాన్నీ, ఆయా వ్యాసాలనూ సమీక్షించినాయి. ఆయా వ్యాసాలలోని 'లోపాల'ను గుర్తించాయి. రంగనాథాచార్యుల అభిప్రాయాలకూ ఆయా వ్యాసకర్తల అభిప్రాయాలకూ విభే

దాలు చాలాచోట్ల ఉన్నాయి. ఇట్లాంటి సందర్భాలలో ఆయా వ్యాసకర్తలకు తమ అభిప్రాయాలను పునః నిరూపించుకొనే అవకాశం ఉండదు. అదట్లా ఉంచి రంగ నాథాచార్యుల నిర్వహణలో సాగిన 'సారస్వత వేదిక' తెలుగు సాహిత్యవిమర్శకు విస్తృతిని సాధించాయనేది మాత్రం గుర్తించదగింది. ఈ వేదిక మధ్యలో కొన్నేళ్ళు ఆగినా, మళ్ళీ ఈ సంవత్సరం (1989-90) జి. వి. సుబ్రహ్మణ్యం నిర్వహణలో ప్రారంభమయింది. 'నవ్యసంప్రదాయం' ప్రధాన విషయంగా సాగుతున్న ఉపన్యాసాలు వ్యాససంకలనంగా వెలువడినప్పుడు 'నవ్య సంప్రదాయ' స్వరూప స్వభావాలు ఒక క్రమపద్ధతిలో అవగతమయ్యే అవకాశం కలుగుతుం దనుకోవచ్చు.

ఈ విధమయిన వ్యాసంకలనాల సందర్భంలోనే ప్రధానంగా చెప్పుకో దగిన మరొకటి పేర్వారం జగన్నాథం సంపాదకత్వంలో వెలువడ్డ 'అభ్యు దయ కవిత్వానంతర ధోరణులు' (1987). అభ్యుదయ కవిత్వానంతరం తెలుగు కవితారంగంలో వచ్చిన ధోరణులను అనుశీలిస్తుంది సంకలనం. అభ్యుదయ కవిత్వానంతరం అనగానే అభ్యుదయ కవిత్వం ఆగిపోయిందా అనే ప్రశ్న సహజంగా కలుగుతుంది. దీనికి ఒకవిధంగా సమాధానం విప్లవ రచయితల సంఘమే. 'అభ్యుదయ' కవిత్వం కాలంతీరిందనీ, ప్రస్తుతం విప్లవ కవిత్వ కాలమని విరసం గట్టిగా విశ్వసిస్తున్నది. అరసంలోనుంచి విరసంలోకి వచ్చిన, లేదా విరసంగా రూపొందినవారి ఈ అభిప్రాయం అంతతేలిగ్గా కొట్టివేయటానికి వీలులేదు. కాగా, అభ్యుదయ కవిత్వానంతరం ఒక్క 'విప్లవ' ధోరణేకాక ఇంకా అనేక ధోరణులు వచ్చినాయి. ఒక విధంగాచూస్తే, సాహిత్యంలో ఒకసారి బలంగా ఆరంభమయిన ఏధోరణీపూర్తిగా అదృశ్యం అవుతుందనిపించదు. కాని, దాని ఉద్ధృతి తగ్గిపోతుంది. వేరే ధోరణులు రావటంలో అసహజత్వ మేమీ లేదు. కాగా ఈ సంకలనంలోని వ్యాస కర్తలందరు గూడా ఒకే దృక్పథానికి సంబంధించిన వారు కారు. అభ్యుదయ, విప్లవ, నవ్యసంప్రదాయ దృక్పథాలకు చెందినవారు ఇందులో సమావేశమయినారు. మొత్తం మీద ఈ వ్యాస సంకలనం దేశీయతకు, నవ్యసంప్రదాయరీతికి ప్రాధాన్యం కలిగించటం, వాటి అవసరాన్ని నిరూపించటం భూమికగా సాగింది. సంపాదకీయ వ్యాసవిషయం అట్లాఉంచితే సారస్వతవేదిక

వెలువరించిన 'ఆధునిక సాహిత్యంలో విభిన్నధోరణులు' తరువాత రావలసిన వ్యాససంకలనంగా 'అభ్యుదయానంతర కవిత్వధోరణులు' ప్రాధాన్యం పొందుతున్నది.

ఈ దశాబ్దానికి సంబంధించి సాహిత్యపరంగా చెప్పుకోవలసిన అంశం విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగలు' నవలకు స్వర్ణోత్సవం జరుగటం. నల్లగొండలోనూ (1984), వరంగల్లులోనూ (1985) ఈ ఉత్సవాలు జరిగినాయి. వరంగల్లులో రెండు గోష్ఠి కార్యక్రమాలు గూడా జరిగినాయి. ఆ ఉత్సవంనాడు (1985 సెప్టెం. 20) దాదాపుగా ప్రధాన దినప్రతికలన్నీ వేయిపడగలను గూర్చి ప్రత్యేక వ్యాసాలు వెలువరిచినాయి. ఆసందర్భంగా అరుణతార వంటి మాస పత్రికకూడా ప్రత్యేక వ్యాసం ప్రచురించింది. అయితే గమనించవలసిన విశేషం ఈ గోష్ఠుల్లో, వ్యాసరచనలో వేయిపడగలుకు సంబంధించి అనుకూల, ప్రతికూల, తటస్థవైఖరులుగల విమర్శకులు ఇందులో అన్వయించటం ఏటుకూరి బలరామ మూర్తి, సి. రాఘవాచారి, పాములపర్తి సదాశివరావు, కందర్ప రామచంద్రరావు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, తుమ్మపూడి కోటేశ్వరరావు, జువ్వాడి గౌతమరావు ప్రభృతులందరూ వ్యాసాలురాశారు. ఈ వ్యాసాలతోపాటు జి. వి. సుబ్రహ్మణ్యం, సుప్రసన్న, నాయని కృష్ణకుమారి, వడలి మందేశ్వరరావు ప్రభృతులు రాసిన మరికొన్ని విమర్శవ్యాసాలు కలిపి తెలుగు అకాడమి 'విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం' పేర ఇటీవల (1989) వెలువరించింది. ఈ స్వర్ణోత్సవ సందర్భం లోనే ముదిగొండ వీరభద్రయ్య రచించిన 'వేయిపడగలు: ఒక పరిశీలన', (1984) అనుమాండ్ల భూమయ్య రచించిన 'వేయిపడగలు: ఆధునిక ఇతిహాసం' (1985) వెలువడ్డాయి. ఇటీవల కె.వి.ఎన్. రాఘవన్ రచించిన 'వేయిపడగలు: సమకాలీనత - సార్వకాలీనత' (1989) అనే విస్తృత వివేచన గ్రంథం తెలుగు అకాడమి వెలువరించింది. బందరులోని కవిప్రభా (కవిసమ్రాట్ విశ్వనాథ ప్రతిభా భారవి) పక్షాన తుమ్మపూడి కోటేశ్వరరావుగారి వేయిపడగలు గూర్చిన గ్రంథం వెలువరించింది. ఇవన్నీ ఇంతగా పేర్కొనటం ఒక నవల సాహిత్య విమర్శరంగాన్ని ఎంతగా కదిలించిందనే విషయం సూచించటానికి మాత్రమే ఈ సందర్భంలోనే రామాయణ కల్పవృక్షాన్ని గూర్చి వడలి మందేశ్వరరావు రచించిన 'ఇదీకల్పవృక్షం' విశేషంగా గమనించదగిన గ్రంథం. ఒక మహా

కావ్యాన్నిగూర్చి ఈ విధమయిన గ్రంథం మరొకటి లేదేమోననిపిస్తుంది. గ్రంథం మొత్తం కావ్యాన్ని విమర్శిస్తూ పరామర్శిస్తూనే, ఇది 'విమర్శ'అని అనిపించనంత 'విమర్శ శిల్పం'గల గ్రంథమిది. ఒక అద్భుతమయిన కావ్యాన్ని అధునిక విచార మార్గాన అత్యంత ఆస్వాదనీయం చేస్తుందీ విమర్శగ్రంథం. దీనితోబాటు రామాయణ కల్పవృక్షం గూర్చి ధూళిపాళ శ్రీరామమూర్తి కల్పవృక్ష రామ జీయకత, దివాకర్ల వేంకటావధాని 'విశ్వనాథ: వాల్మీకి' గ్రంథాలు ఈ దశాబ్దంలోనే వెలువడ్డాయి. ఒక కవి సాహిత్యాన్ని గూర్చి ఇన్నిన్ని విమర్శ గ్రంథాలు మరే దశాబ్దంలోనూ వెలువడకపోవటం, మరేకవిని గూర్చి రాకపోవటం విశేషంగా గమనించదగిన విషయం.

విశేషమయిన పరిశీలనకు ఈ దశాబ్దంలో విషయమయిన మరో నవల 'చివరకు మిగిలేది'. దీనిపై గొప్ప తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి తత్త్వ ప్రభావాన్ని వివేచించే గ్రంథం ముదిగొండ వీరభద్రయ్య రచించారు. ఇదే నవలను పలుకోణాలనుంచి దర్శించిన సిద్ధాంత గ్రంథం కాత్యాయనీ విద్మహే రచించిన 'చివరకు మిగిలేది'. చిత్రమేమిటంటే, కాత్యాయని గ్రంథంలో తాను ప్రతిపాదించిన అనేకాంశాలను ఆ గ్రంథానికితాను రాసుకొన్న పీఠికలో ఖండించటం లేదా ఆ అంశాలతో భేదించటం. గ్రంథరచన నాటికీ, దాన్ని అచ్చువేసేనాటికీ ఆమె ఆలోచనలోనూ విచారరీతిలోనూ వచ్చిన మార్పులను ఇది వ్యక్తంచేస్తుంది. ఇక్కడ ఒక విషయం గమనించవలసి ఉంది. తెలుగు సాహిత్య రంగంలో ఆధునికంగా రచయిత్రులు నవల, కథాప్రక్రియలలోనూ, అంతకన్నా చాలా తక్కువగా కవితా ప్రక్రియలలోనూ కన్పిస్తారు. కాని విమర్శ రంగంలో దాదాపుగా రచయిత్రులెవరూ నిలదొక్కుకొన్నట్టు కన్పించదు. ఈ దశాబ్దంలోనే రంగంమీదికి వచ్చి విమర్శ రంగంలో నిలదొక్కుకున్నది కాత్యాయని. వాసిరెడ్డి సీతాదేవి రచించిన 'రాబందులూ - రామచిలుకలూ' నవలను 'పంచాయతీరాజ్య రాజకీయ నవల'గా గుర్తించి పాలనా శాస్త్రంలో కృషి చేసిన శోభతో కలిసి కాత్యాయని 1981లో విమర్శ గ్రంథం రచించింది. ఆ తరువాత 'తెలుగు' పత్రికలో చలం గూర్చి, అలంకార శాస్త్రంలో స్త్రీని గూర్చి రచించిన వ్యాసాలు ఆమె విమర్శ తీరులోని నైశిత్యాన్ని ప్రతిబింబిస్తాయి. విమర్శలో మనోవైజ్ఞానిక

రీతిని గూర్చి డి. విద్యేశ్వరి రచించిన గ్రంథం విమర్శకు దోహదం కలిగించేదే. ఇట్లాగే గమనిస్తే మరొకరిద్దరు కన్పించవచ్చు. కాగా, విమర్శ రంగంలో స్త్రీలు పాల్గొని ముందంజవేయటం ఈ దశాబ్దంలోని ఒక విశేషం.

ఈ దశాబ్దంలోనే విమర్శ రంగంలో మరొక విధానం ఆసక్తికరంగా ఆరంభమయింది. వివిధ సామాజిక శాస్త్రాల దృష్టితో సాహిత్యాన్ని పరిశీలించటం ఈ విధానం. ఈ విధానంలో పరిశీలన సాగించిన ఏడు వ్యాసాల సంకలనం ఒకటి 'విభాత సంధ్యలు : తెలుగు సాహిత్యంలో సమాజం'. (1986). దీని సంపాదకుడు సి.వి. సుబ్బారావు. ఈ వ్యాసకర్తలు ఆర్థిక, రాజనీతి, చరిత్ర, సామాజిక శాస్త్రాలను అధ్యయనం చేశారు. సంపాదక వ్యాసం 'అనిశ్చిత అన్వేషణ'లో సుబ్బారావు—'వస్తువు, రూపం, భాషల్లో శతాబ్ది కాలం పాటు తెలుగు సాహిత్యం ప్రయాణించిన ఈ దూరం నిజానికి తెలుగు సమాజం ప్రయాణించిన దూరం చలనంలో ఉన్న మన సమాజం అభివృద్ధి - క్షీణతల వెలుగు నీడల చైతన్య రూపమే సాహిత్యం. అందుకే సాహిత్యంపై సామాజిక శాస్త్రవేత్తల ఈ విమర్శనా వ్యాస సంకలనం' అన్నారు. ఆయా శాస్త్రాల పరంగా రచనల్లోని వస్తు స్వరూపాన్నీ, నిర్వహణనూ పరిశీలించటం ఈ విధమయిన విమర్శ స్వరూపం. వస్తు-రూపాల సమత్వాన్ని అంగీకరిస్తూ గూడా మార్క్సిస్టు విమర్శ వస్తువుకు ప్రాధాన్యమివ్వటం ఆ తీరు విమర్శలో గమనించవచ్చు. వివిధ సామాజిక శాస్త్రాల దృష్టితో కావ్యవస్తువును పరిశీలించటమన్నది ఇక్కడ విశేషం. సామాజిక శాస్త్రాల దృష్ట్యా సాగే ఈ విమర్శ ఆ శాస్త్రాలకూ ఉపకారకంగా ఉంటుందనవచ్చు. సాహిత్యపరంగా వస్తు వివేచన కేవలం వస్తువివేచన మాత్రమే. మనోవిజ్ఞానశాస్త్రం దృష్ట్యా కావ్యాన్ని వివేచించేతీరు ఇదివరకు సాహిత్య విమర్శలో ప్రసిద్ధమే. అయితే ఈ వ్యాససంకలనంలో ఆధునికరచయితల రచనలు మాత్రమే విమర్శ విషయాలుగా ఉన్నాయి. మరొకటి: ఒక్కొక్క శాస్త్రం దృష్ట్యానే ఈ వివేచన సాగింది. ఒకే రచనకు వివిధ శాస్త్ర - సామాజిక శాస్త్రాల దృష్ట్యా పరిశీలించడం కూడా జరుగవచ్చు. అయితే అది మరింత క్లిష్టమయిన విధానం. అది జరిగితే, అట్లాంటి తీరువల్ల సాహిత్యానికీ, సాహిత్య విమర్శకూ కలిగే లబ్ధి తెలిసిరావచ్చు. ముందు ముందు ఈ విధమయిన విమర్శ గాఢంగా సాగినప్పుడు

గాని ఈ విషయం తేలదు. అప్పటిదాకా ఈ దశాబ్దంలో సాహిత్య విమర్శ మార్గాన ఈ తీరు ఆరంభం కావటమే ఒక విశేషంగా చెప్పుకోవలసి ఉంటుంది.

ఈ దశాబ్దంలో మరొక అంశం ప్రత్యేకంగా కన్పిస్తుంది. మార్క్సిస్టు విధానాన్ని ఒక రచనా విషయంలో అనువర్తింపజేయటం జరుగుతూనే ఉంది. అయితే ఈ విధానం అనువర్తింపజేయటంలో విమర్శకులకు మార్గనిర్దేశకంగా అన్నట్టు ఆ విధానాన్ని నిరూపించే రచనలు వచ్చినాయి. వీటిలో విశేషంగా పేర్కొవలసినవి బాలగోపాల్ రచించిన 'రూపం - సారం', వై. విజయకుమార్ రచించిన 'సాహిత్యం వాస్తవికత'. ఈ రెండూ 1986 లో వెలువడిన గ్రంథాలే. అయితే, ఈ ఇద్దరూ సాహిత్య విమర్శరంగంలో అంతగా ప్రసిద్ధులు కారు. సృజన, అభ్యుదయాలలో ఈ రచయితల వ్యాసాలు కొన్ని వచ్చాయి. అయితే, ఈ విధాన వివేచన ఇంకా ప్రామాణికులయిన మార్క్సిస్టు విమర్శకులు రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు వంటివారు నిర్ధారించవలసే ఉంది. సాహిత్యేతర ప్రమాణాలను అనువర్తింపజేసే అన్ని సందర్భాల్లోనూ ఈ స్థితి తప్పదేమో ననిపిస్తుంది. అభ్యుదయ పత్రిక విమర్శ విశేష సంచికను వెలువరించింది. అందులోనూ ఎక్కువ వ్యాసాలు ఈ విషయానికి సంబంధించినవే.

తెలుగులో నవలా సాహిత్యం ఎంతో విస్తృతమయింది. దాన్ని గూర్చిన విమర్శ గూడా చాలా విస్తృతమయిందే. అయితే నవల స్వరూప స్వభావాలను వివరించే గ్రంథం ఒకటి వల్లంపాటి వెంకటసుబ్బయ్య 'నవలా శిల్పం', నవలా విమర్శను గూర్చి చాలా ఉత్తమంగా ఇటీవలనే వెలువడింది.

ఈ దశాబ్దంలో ప్రధానంగా గుర్తించవలసిన ప్రధానాంశం ఒకటి ఉంది. అది దేశీయమయిన విమర్శ విధానం, మార్క్సిస్టు విమర్శ విధానం పరస్పరం తమను తాము స్పష్టం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్న తీరు. ఈ ఉభయ రీతులూ ఈ దశాబ్దంలో పడినంత పోటీ మరే దశాబ్దంలోనూ కన్పించదు.

మొత్తం మీద ఈ దశాబ్దంలో వచ్చిన అన్ని విమర్శ గ్రంథాలనూ విమర్శకులనూ తీరులనూ వివరించటానికి ప్రస్తుత పరిధి చాలదు. అందుకే ఇది ఒక విహంగావలోకనం మాత్రమే.

# ఈ దశాబ్దంలో సాహిత్య పరిశోధన

—డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం

తెలుగులో పరిశోధనకు ఇప్పుడు దాదాపు రెండు శతాబ్దాల చరిత్ర ఉన్నదని చెప్పుకోవచ్చు. సాహిత్య పరిశోధన ఒక ప్రక్రియగా పరిగణింపబడుతున్నది. ప్రక్రియా చరిత్రలో ఆరంభ వికాసాలూ, పరిణామాలూ, ఎగుడు దిగుళ్ళూ, పతనోత్థానాలూ ఉండటం సహజం కాని, దాని జీవితం ప్రవాహం లాంటిది, తెలుగులో పరిశోధన పుట్టి పెరిగి నేటిదాకా సాగిన చరిత్రను గమనిస్తే ఏడు ఘట్టాలను దర్శించవచ్చు. వాటిని ముందు గమనిద్దాం

1. పరిశోధన సామగ్రి సేకరణ, విశ్లేషణ కాలం. (Period of collection and classification of research material) - 19 వ శతాబ్ది పూర్వార్ధం.
2. ప్రాధాన్యాంశ వివక్షా కాలం - (Period of priorities) - 19 వ శతాబ్ది ఉత్తరార్ధం.
3. సాహిత్య చరిత్ర నిర్మాణకాలం - (Period of building literary history) - 20 వ శతాబ్ది పూర్వార్ధం.
4. సాహిత్య చరిత్ర యుగాలను, కవులను, రచనలను, ప్రభావ పరిశీలనలను వ్యష్టిగా, సమష్టిగా విశ్లేషించి వివేచించే కాలం - (Period of evaluation of the periods of literary history, Individual works and poets and Influential Studies) సుమారు 1950 నుండి 1960 వరకు.
5. సాహిత్య సిద్ధాంతాలనూ, సమన్వయాలనూ ప్రతిపాదించే కాలం (Period of literary theories and interpretations) సుమారు 1960 నుండి 1970 వరకు.

6. ఎన్నుకొన్న ప్రత్యేకాంశాలను వివిధ దృక్కోణాలతోనో, దృక్పథాల తోనో అనుశీలించే కాలం-(Period of evaluation of special areas with different angles and approaches) - సుమారు 1970 నుండి 1980 వరకు.
7. ఏకదేశాంశ విశ్లేషణ కాలం - (Period of analysis of a particular or concentrated aspect of a poem or a work or a group of works) - 1980 నుండి నేటి వరకూ.

ఇవి కచ్చితమైన రేఖలు కావు, ఎల్లలు కావు. కాని, పరిణామపరిశీలనకు అనువుగా ఉండే వివేచన చిహ్నాలు; కొన్ని కొండ గుర్తులు.

విశ్వవిద్యాలయాలలో తెలుగు సాహిత్య పరిశోధన క్రీ.శ. 1950 తరువాతనే విశేషంగా సాగింది. ఆ తరువాత పాతికేళ్ళకు తెలుగు అకాడమీ విశ్వవిద్యాలయాలలో జరిగిన పరిశోధనకు ప్రతినిధులైన సిద్ధాంత వ్యాసాలను వ్యాసకర్తలను పరిచయం చేసే 'పరిశోధన సంహిత' (1975)ను మొట్టమొదటిసారి ప్రచురించింది. అటు తరువాత 1986లో మరో సంపుటాన్ని వెలువరించింది. దాదావు ఈ దశాబ్దం మొదట్లోనే కాకతీయ, ఉస్మానియా విశ్వవిద్యాలయాలు తమ తమ పరిశోధన పత్రికలను వెలువరించటం ప్రారంభించాయి. అవి విమర్శిని (కాకతీయ), వివేచన (ఉస్మానియా). వీటిలో ఆయా విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖల్లో యేటేటా జరిగే పరిశోధన వివరాలను పట్టికలుగా ప్రకటిస్తూండే వారు. పరిశోధనాంశాల ఎంపికలో పునరుక్తిని తొలగించటానికి ఇవి బాగా తోడ్పడ్డాయి. అంటే గత దశాబ్దంలో మొదటిసారి పరిశోధన వివరాలను క్రమబద్ధంగా సంకలనం చేసి వెలువరించే ప్రయత్నం జరిగిందన్న మాట! దీని వలన సిద్ధాంత వ్యాసాలలో క్రొత్తగా ప్రతిపాదింపబడిన విశేషాలనూ, సమన్వయాలనూ, సిద్ధాంతాలనూ సాహితీ వ్యాసంగాల్లో వినియోగించుకోటానికి ఎంతో వీలుగలిగింది.

గత దశాబ్దం కంటె ఈ దశాబ్దం ఈ మార్గంలో మరో ముందడుగు వేసింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తన రజతోత్సవ సందర్భంగా 'తెలుగులో పరిశోధన' అనే విలువైన సంపుటిని 1983లో ప్రచురించింది. తెలుగు పరిశోధన చరిత్ర నిర్మింపబడటానికి ప్రాతిపదికగా కావలసిన మౌలిక సామగ్రిని

ఒక చోట చేర్చటమే కాకుండా, విశ్లేషణాత్మకంగా వివేచనాత్మకంగా ఎన్నో విలువైన సమన్వయాలను ఈ సంపుటి వెలుగులోకి తీసుకుని వచ్చింది. దీని వలన తెలుగులో భాషాశాస్త్ర పరిశోధనకూ సాహిత్య పరిశోధనకూ ఉండే సామ్య భేదాలు స్పష్టంగా తెలిసి వచ్చాయి. భాషాశాస్త్ర పరిశోధన కంటె సాహిత్య పరిశోధనలో ఎన్నో విలువైన వినూత్నాంశాలూ, సమన్వయాలూ, సిద్ధాంతాలూ ప్రతిపాదింపబడినట్లు ప్రకటితమైంది. నాకు తెలిసినంత వరకూ తెలుగులో పరిశోధనను అనుశీలించడానికి చేసిన మొదటి ప్రయత్నం ఇదే. ఇది ఈ దశాబ్ది వేసిన మొదటి ముందడుగు.

సాహిత్య అకాడమీ 'తెలుగులో పరిశోధన' సమీక్షా గ్రంథం కావడం చేత వ్యాస సంకలనం కావడం చేత అన్వయ సూత్రాలను అధికంగా అందిస్తూ గణాంక సూత్రాలను పరిమితంగా పరిచయం చేసింది. అనుబంధంగా అకారాది క్రమంలో ఇచ్చిన పరిశోధనాంశాల పట్టిక సమాచారాన్ని అందజేస్తున్నా విషయ పరంగా వర్గీకృత పరిశోధన వివరాలను అందులో నుంచి విశ్లేషించుకోవలసిన పరిశ్రమను మిగిల్చింది. కొత్తగా పరిశోధన మొదలు పెట్టే విద్యార్థులకు తాము సమస్యను ఎన్నుకొనే పరిశోధన రంగంలో లేదా, ప్రత్యేక సాహిత్య శాఖలో ఏఏ సిద్ధాంత వ్యాసాలు వచ్చాయో ఒక్క చోట కూర్చబడ ఉంటే సౌకర్యంగా ఉంటుంది. వివిధ విజ్ఞానశాస్త్ర శాఖల్లో ఇటువంటి విశ్లేషణను అందించే పరిశోధన పత్రికలు ఎన్నో ఉన్నాయి. విచారించదగిన విషయమేమంటే - తెలుగులో అన్ని విశ్వవిద్యాలయల్లోనూ జరుగుతున్న పరిశోధనాంశాలను కనీసం పట్టిక రూపంలోనైనా ప్రచురించే పత్రిక తెలుగు వారికి లేకపోవడం.

ప్రతి సంవత్సరం విశ్వవిద్యాలయాల్లో శతాధిక సంఖ్యలో పరిశోధకులు కొత్త పరిశోధనలను ప్రారంభిస్తున్న ఈ దశాబ్దంలో విద్యార్థుల అవసరాలు ప్రధానంగా 10 రకాలుగా కనపడుతున్నాయి.

1. సమీకృత పరిశోధన సమాచారం.
2. తెలుగులో పరిశోధన వికాసవివేచనం.
3. వివిధ విషయాలపై వెలువడుతున్న రచనలు వాటి ఆకరాల సంపుటీకరణం.
4. వర్గీకృత పరిశోధనా సామగ్రి సమీకరణం.
5. ఎప్పటి కప్పుడు, కనీసం సంవత్సరానికి ఒకసారైనా, తెలుగులోనూ తెలుగును గురించి ఇతర భాషలలోనూ జరుగుతున్న పరిశోధనాంశాలను సంపుటీకరించడం.
6. ఒక్కొక్క సాహితీ శాఖలో ప్రతిపాదింపబడుతున్న క్రొత్త సమన్వయాలనూ, సిద్ధాంతాలనూ ఆయా ప్రక్రియలలో జరుగుతున్న వికాస చరిత్రల్లో భాగంగా అనుశీలనాత్మకంగా అన్వయించటం.
7. మన సాహిత్యంలో జరుగుతున్న పరిశోధనలను భారతీయ సాహిత్య పరిశోధనలతో పాశ్చాత్య సాహిత్య పరిశోధనలతో తులనాత్మకంగా చూపగలిగే సమాచారాలు సమన్వయాలు.
8. పరిశోధన సమస్యలకు సంబంధించిన విశ్లిష్టాంశాల గణాంక విశేషాల సూచికలు.
9. అత్యంత ఆధునిక సాహిత్య పరిశోధన పద్ధతుల ప్రయోగాలను తెలపడంతో పాటు వాటిని తెలుగుకు అన్వయించే విధానాలను కూడా వివరించే రచనల ప్రచురణ.
10. వార్షిక పరిశోధన సమీక్షలు.

ఈ అవసరాలను గమనిస్తే మన పరిశోధక విద్యార్థులకు ఈనాడు అందుబాటులో ఉన్న సౌకర్యాలు చాల పరిమితమైనవని కూడా మనకు స్పష్టపడుతుంది. పరిశోధకులకు సమస్య (Topics) లెంత ముఖ్యమో వాటికి సంబంధించిన సామగ్రీ అంత ముఖ్యం. ఆ సామగ్రి దొరికే ఆకారాలు కూడా అంతకంటే ముఖ్యం. తెలుగులో అటువంటి ఆకారాలను సేకరించి సంపుటీకరించి ప్రచురించే

ప్రయత్నం కూడా మొదటిసారి ఈ దశాబ్దంలోనే జరిగింది. హైదరాబాదు విశ్వ విద్యాలయం తెలుగుశాఖ 'తెలుగు సాహితి' 1986లో 'ఆలోకన - 1985' అనే వార్షిక వాఙ్మయ సూచిని ప్రచురించింది. దానికి నేను ప్రధాన సంపాదకుణ్ణి కావడం నా అదృష్టం. దాదాపు 35 మంది విద్యార్థులు, అధ్యాపకులు ఈ వాఙ్మయ సూచి సంకలనంలో స్వచ్ఛందంగా పాల్గొన్నారు.

అభివృద్ధి చెందుతున్న ఏ సాహిత్యమైనా, ఈ ఆధునిక యుగంలో, ఒక సంవత్సరకాలంలో గణనీయమైన కృషిని సాగిస్తుందని అనడంలో అతిశయోక్తి లేదు. ఒక్కొక్కసారి సాహిత్యరంగాల్లో వస్తున్న నూత్న ధోరణులు, సరికొత్త ప్రయోగాలు రెండుమూడు ఐదేళ్ళలోనే పుట్టిపెరిగి శమిస్తున్నాయి. వాటి పోకడలను ప్రయోగాలను, ప్రమాణాలను, ప్రజాదరణను, సాహిత్య శక్తియుక్తులను అంచనా కట్టాలంటే ప్రతిఏటా వస్తున్న రచనలను గురించిన వాస్తవాలను పరిశోధకులు తెలుసుకోవలసి ఉంటుంది. మనకు పరిశోధన పత్రికలు సాహిత్య పత్రికలు చాలా పరిమితం కావడంచేత దినపత్రికలు, సాహిత్యేతర పత్రికలు కూడా విలువైన వ్యాసాలను నేడు ప్రచురిస్తూ ఉన్నాయి. అయితే దిన పత్రికల్లాంటివి గ్రంథాలయాలలో భద్రపరచబడవు. అందువలన సాహిత్య పరిశోధనకు ఆకరాలయిన వాటి వివరాలెన్నో కనుమరుగయిపోయే చిత్రమైన పరిస్థితి నేడు మనకు ఏర్పడింది. 'ఆలోకన-1985' పరిశోధకుల కేర్పడిన ఇటువంటి ఇబ్బందిని తీర్చడానికి ప్రారంభింపబడింది. సమకాలీన సారస్వత జగత్తులో సజీవ ప్రమాణాల స్థితిగతులను తెలుసుకోవడానికి అనువయిన ఉపకరణం-వార్షిక వాఙ్మయ సూచి. దాన్ని ప్రాతిపదికగా చేసుకుని ఒక్కొక్క సంవత్సరంలో విభిన్నరంగాలలో తెలుగులో వస్తున్న పరిణామాన్ని సప్రమాణంగా, శాస్త్రీయంగా అనుశీలించటానికి ఇటువంటి 'సూచి' తోడ్పడుతుంది. అన్ని భాషలలో ఇటువంటి సూచికలు వెలువడుతున్నాయి. తెలుగులో తొలిసారి 'ఆలోకన' ఆవిర్భవించింది. ఎన్నో నాళ్ళబట్టి ఎదురుచూస్తున్న ఒక మంచిపని మొదలైందని, పత్రికలు, ప్రజలు

హర్షించారు. ఆ పనిని చేపట్టిన హైదరాబాదు విశ్వవిద్యాలయాన్ని అభినందించారు. కాని, దురదృష్టవశాత్తు అది అంతటితో ఆగిపోయింది. 'శ్రేయాంసి బహు విఘ్నాని, ఒకటిమాత్రం సత్యం వార్షిక వాఙ్మయసూచి అనే ఒక విలువకు 'ఆలోకన' ఒక అక్షరోదాహరణం. 'ఆలోకన' ఆగిపోవచ్చును కాని అటువంటి ప్రయత్నం ఆగిపోరాదు. పరిశోధకుల అవసరం మాత్రం 'తీరని దాహంలా' వేధిస్తున్నది. ఆ దాహం తీరే అదృష్టం మరెప్పుడో.

పైన పేర్కొన్న పదిఅవసరాలూ అవి చెప్పిన వరుసలో ఒక వికాసాన్ని కూడా సూచిస్తాయి. మొదటి అవసరము - తెలుగు అకాడమీలో 'పరిశోధన సంహిత'ను ప్రచురింపజేసింది. రెండవ అవసరం - సాహిత్య అకాడమితో 'తెలుగులో పరిశోధన' సంచికను వెలువరింప జేసింది. మూడవ అవసరం హైదరాబాదు విశ్వవిద్యాలయం తెలుగుశాఖ వారిచేత 'ఆలోకన - 1985'ను ప్రకటింపజేసింది. ఆ తరువాత అవసరం వెలుదండ నిత్యానందరావు గారిచేత 'విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన' అనే సిద్ధాంత వ్యాసాల పట్టికను ముద్రింప చేసింది. ఐదవ అవసరం - డా॥ ఎన్. గోపి ప్రభృతుల సంపాదకత్వంలో వెలువడిన 'తెలుగు పరిశోధన' (త్రైమాసిక పత్రిక) ప్రతి సంచికలో తెలుగు పరిశోధన వివరాలను ప్రచురించే సంప్రదాయాన్ని నెలకొల్ప జేసింది. ఇప్పటికి ఈ అయిదన్నా ప్రయోగరూపం దాల్చినందుకు మనం కొంత సంతోషించాలి. నా అంచనా ప్రకారం మరో అయిదు అవసరాలు ఇంకా తీరవలిసే ఉన్నాయి. బహుశఃఇవి ఈ దశాబ్దం వచ్చే దశాబ్దం (1990-2000) సాధించడానికి మిగిల్చిన కార్యక్రమాలేమో!

నేను ముందు పేర్కొన్న పరిశోధన వికాస ఘట్టాలను పరిశీలిస్తే ఈ దశాబ్దంలో ఏకదేశాంశ విశ్లేషణం ప్రధాన ధోరణిగా కనపడుతుంది. ఈ విషయం పరిశోధనాంశాల కాలక్రమ పట్టికను గమనిస్తే తేలిగ్గా తెలిసిపోతుంది. ఈ ధోరణి వివిధ విషయాలపై సాగిన సిద్ధాంతవ్యాసాలలో ఎలా పరివర్తించిందో శ్రీ వెలుదండ నిత్యానందరావు వర్గీకరణాన్ని ఆధారంగా చేసుకుని వివరించడానికి ప్రయత్నం చేస్తాను.

కవిత్రయం రచనలపై వెలువడిన పరిశోధనాంశాల్లో సాహిత్య సంబంధులైన అంశాలు నలభై రెండున్నాయి. ఇవి దాదాపు 1957 నుండీ 1987 వరకూ వచ్చిన సిద్ధాంత గ్రంథాలు. ఆ 42లో 24 ఈ దశాబ్దంలో వచ్చిన వ్యాసాలు. ఆ 24లో 12 ఆంధ్ర మహాభారతంలోని పాత్ర చిత్రణలను వివేచించే వ్యాసాలు. అంటే సగానికి సగం ఈ దశాబ్దంలో పరిశోధకులు పాత్ర చిత్రణమీదనే పరిశోధన సాగించారన్నమాట. స్వభావాన్ని బట్టి చూస్తే ఒక కావ్యంలోని ఏక దేశాంశ విశ్లేషణమే అవుతుంది - పాత్రచిత్రణ పర్యాలోచనం, మిగిలిన 12 అంశాల్లో కూడా ప్రకృతి వర్ణనలను గురించి, ఔపదేశిక ప్రతిపత్తిని గురించి, ధర్మస్వరూపాన్ని గురించి, వివిధ ఉపాఖ్యానాలను గురించి, నాటకీయ శిల్పాన్ని గురించి విశ్లేషించినవి ఉన్నాయి. మరొకవిశేషమేమంటే 18 పర్వాల్లో ఒక్కొక్క పర్వాన్ని, లేదా పర్వంలో భాగాన్ని, లేదా ఆ పర్వంలో నామ విజ్ఞానం, క్రియా విజ్ఞానం లాంటి ఏక దేశాంశాలను గురించి పరిశోధన చేసినవి కనపడుతున్నాయి. ఈ దశాబ్దపు ధోరణిని నిత్యానందరావు పట్టికలోని మొదటి అంశమే ముచ్చటగా నిరూపిస్తోంది.

ఇలాగే, ఏ చిన్న అంశాన్ని తీసుకుని పరిశీలించినా ఈ ధోరణి తేటతెల్లమవుతూ ఉంది. మచ్చుకు - ఒకటి రెండంశాలను గమనిద్దాం. నిత్యానందరావు పట్టికలననుసరించి విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షం మీద వెలువడిన సిద్ధాంత వ్యాసాలు మొత్తం పన్నెండు. ఇందులో దాదాపు అన్నీ ఏక దేశాంశ విశ్లేషణలే. ఒక్కటి మాత్రల తులనాత్మక పరిశీలనం. అలాగే డా॥ సి. నారాయణరెడ్డి గారి రచనల మీద వెలువడిన మొత్తం ఏడు సిద్ధాంత వ్యాసాలలో ఆరు ఈ దశాబ్దంలోనే వచ్చాయి. అందులో ఐదు ఏకదేశాంశ విశ్లేషణకు సంబంధించినవి.

ఏకదేశాంశవిశ్లేషణ ధోరణి ఈ దశాబ్దంలో విస్తృతి కావడానికి గల కారణాల్లో మొదటిది ఎం. ఫిల్., కోర్సులలో విద్యార్థులు ఎక్కువగా చేరడం, పరిమిత కాలంలో పరిశోధనలు ముగించవలసి రావడం, ప్రత్యంశ పరిశీలనానికి

ప్రాధాన్యం కల్పించే పరిశోధన పత్రాలకు, గోష్ఠీ వ్యాసాలకూ, సామగ్రి సంపుటులకు, ఆకర చర్చలకూ, కవుల వాఙ్మయ సూచికలకూ పరిశోధన రంగంలో ఈ దశాబ్దంలో ఒకవిధమైన గుర్తింపుగౌరవం కలుగుతూ ఉండడం. ఈనాడు పరిశోధన పత్రానికి, ఎం.ఫిల్; సిద్ధాంత వ్యాసానికీ అంతరాలు తగ్గుతున్నాయి. పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథానికీ ఎం.ఫిల్; సిద్ధాంత వ్యాసానికీ సరిహద్దులను నిర్దేశించడానికి పూనుకోవడం కొన్నిసార్లు సాహసమే అవుతూఉంది. ఈ ధోరణి. ఉత్తమమా, మధ్యమమా, అధమమా అని చర్చించడం ప్రస్తుతం కాదుగాని, నిర్దిష్టమైన పరిమితాంశంలో గాఢమైన పరిశోధన చేసే ఒక తీక్ష్ణ ప్రవృత్తికి ఈ ధోరణి సాధనగా నిలుస్తోంది.

ఏ దశాబ్దంలోనైనా ఎన్నో కొన్ని పరిశోధన గ్రంథాలు వెలువడవచ్చు. కాని, ఆ పరిశోధన గ్రంథాలు సాహిత్యలోకంలో కలిగించే చైతన్యాన్నిబట్టి వాటి విలువలను నిర్దేశించటం జరుగుతుంది. సామన్యంగా అటువంటి పరిశోధనలను ఈ విధంగా వివేచించవచ్చు.

1. పూర్వదశాబ్దంలో పుట్టి ఈ దశాబ్దంలో చర్చనీయాంశాలుగా నిలిచేవి. 2. ఈ దశాబ్దంలోనే వెలువడి సాహిత్య ప్రక్రియలకు వినూత్నమైన అనుశీలన సూత్రాలను కల్పించేవి. 3. కావ్యాల విలువలను వినూత్న దృక్కోణాలతో నిర్ధరించేవి. 4.పూర్వ సిద్ధాంతాలనుగాని వాదాలనుగాని సవరించి, పరిష్కరించి అభినవ దృక్పథాన్ని, విమర్శకులకు అందించేవి. 5. నూత్న సిద్ధాంతాలను ప్రతిపాదించేవి.

పైన పేర్కొన్న మొదటి రకానికి డా॥ వెల్చేరు నారాయణరావుగారి, 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' (1978) సరియైన ఉదాహరణం. అల్బర్ట్. సి. లార్డ్ యుగొస్లోవియా సాహిత్యానికి అన్వయించిన 'ఆశు సాహిత్య' సూత్రాలను తెలుగు సాహిత్యానికి అన్వయించడానికి ప్రయత్నం చేసిన మొదటి పరిశోధన గ్రంథం. మార్క్స్ వాక్యాలతో పుస్తకం మొదలుకావడం, 'కవితా

విప్లవాల స్వరూపం' అనే పేరు ఉండడం, 'ఆశు' 'లిఖిత' సాహిత్య సంప్రదాయ సూత్రాలను సాహిత్యపు విలువలను నిర్ణయించడానికి ప్రాతిపదికలుగా తీసుకోవడం, అభ్యుదయ వాదుల పరిభాషతో పరంపరాగతంగా వస్తున్న భావజాలాన్ని విమర్శించడం, కొన్ని పాత భావాలకే చెప్పే ధోరణిలో వైచిత్రిని కల్పించి ఆసక్తికరంగా ఉండేటట్లు చేయడం మొదలైన గుణాలు మొట్ట మొదట ఈ గ్రంథంవైపు పఠితలను ఆకర్షింపజేశాయి. ఈ గ్రంథంలోని శైలి జీవ చైతన్యంతో ఎంతో మందిని ఆకర్షించింది. కొంత మందికి ఆ పుస్తకం ఒక క్రొత్త లోకాన్ని చూపిస్తున్నట్లు అనిపించింది. ముందు ప్రశంసల జల్లులు కురిశాయి. ఆ పైన అనుమానాలవడగళ్ళు రాలాయి 'ఆశు కవిత్వ' మన్నందుకు అభ్యంతరాలు కొందరు, 'విప్లవ శబ్దానికి అర్థం మారిపోయిందని ఆగ్రహించారు కొందరు. అందులో మార్క్సిస్టు విమర్శ నేతి బీరకాయలో నేయేనని అధిక్షేపించారు కొందరు. రచయిత ప్రతిపాదనలలోని వైరుధ్యాలను ఎత్తి చూపించారు కొందరు. విమర్శలపై ప్రతి విమర్శలొచ్చాయి. చివరకు ఈ గ్రంథం చర్చకోసమే పుట్టినట్లుగా, నిర్దుష్టమైన ఒక అనుశీలన మార్గాన్ని అందించలేనట్లుగా ఈ దశాబ్దపు చివరి భాగంలో మిగిలిపోయింది.

ఇంత విస్తృతంగా కాకపోయినా కొంత చర్చకు గురియైన గ్రంథాలు డా॥ మిరియాల రామకృష్ణగారి "శ్రీశ్రీ కవిత్వం - వస్తువు సంవిధానం" (1978), కొర్లపాటి శ్రీరామమూర్తి "కుమార సంభవం నన్నెచోడ కృతమేనా?" మొదలైనవి.

ఇక రెండవ విధం సాహిత్య ప్రక్రియలకు వినూత్నమైన అనుశీలన సూత్రాలను కల్పించేవి: ఈ దశాబ్దంలో వెలువడిన శతాధిక పరిశోధన గ్రంథాలలో ఇటువంటి సూత్రాలను నిరూపించడానికి ఈ వ్యాస పరిధి చాలదు. అందువల్ల హైదరాబాదు విశ్వవిద్యాలయంలో వెలువడ్డ సిద్ధాంత గ్రంథాల్లోని అంశాలను కొన్నింటిని ఈ అంశానికి ఉదాహరణలుగా పేర్కొంటాను. 1. శ్రీమతి

టి. వి. నాగరంజిని, రచించిన "రామదాసు కీర్తనలు - స్వరలయ విన్యాసం - సాహిత్య రసపోషణం" సిద్ధాంత గ్రంథం (1982)లో పద కవిత్వాన్ని అనుశీలించడానికి నిర్దిష్టమైన ఒక మార్గాన్ని చూపించింది. అందులోనూ 'స్వరలయ' పద సాహిత్యంలో రసపోషణకెలా తోడ్పడుతుందో అన్వయించింది. అదే పద్ధతిలో శ్రీమతి బి. ఉషాలక్ష్మి త్యాగరాజ కీర్తనలు, స్వరలయ రస భావ పోషణ అనే సిద్ధాంత వ్యాసం రచించి సంగీత ప్రధానమైన కృతులను అనుశీలించే పద్ధతులను ప్రతిపాదించింది. శ్రీమతి వై. కామేశ్వరీ 1984 లో "అమృతం కురిసిన రాత్రి - వాక్యలయ: భావ పోషణ" అనే సిద్ధాంత వ్యాసంలో వచన కవిత్వంలోని 'వాక్యలయ' భావ పోషణలో ఎలా కీలకమైన పాత్ర నిర్వహిస్తుందో వినూత్నంగా వివేచించి చూపించింది. హైదరాబాదు విశ్వ విద్యాలయం తెలుగుశాఖలో అధ్యాపకులయిన డా॥ పి. రామనరసింహంగారు "Vijayavilasamu - A Stylistic Analysis" అనే తమ సిద్ధాంత వ్యాసంలో మొట్టమొదటి సారిగా శైలీశాస్త్ర పద్ధతులను అత్యంత శాస్త్రీయంగా ఒక సమగ్ర కావ్యాన్ని పరిశీలించడానికి ఉపయోగించారు. వీరి పర్యవేక్షకత్వంలో మరికొందరు విద్యార్థులు శైలీశాస్త్ర పద్ధతులనుపయోగిస్తూ పరిశోధనలు చేశారు.

ఇక కావ్యాల విలువలను వినూత్నదృక్కోణాలతో నిర్ధరించే పద్ధతి మూడవది. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రచురించిన 'సారస్వతవ్యాసములు' మొదటి సంపుటి - ద్వితీయ ముద్రణ పీఠికలో నేను 'తెలుగు కవిత్వపుతీరు తెన్నులను' వివేచిస్తూ నన్నయనుండి ప్రబంధయుగకవులదాక ఆయా కవుల సాహిత్య దృక్పథాలను బట్టి కవితలో వచ్చిన పరిణామాన్ని పరిశీలించి ఒక సమన్వయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాను. అందులోని కొన్ని వినూత్నమైన ప్రతిపాదనలను ఆధారంగా చేసుకుని కొందరు పరిశోధకులు సిద్ధాంత గ్రంథాలు వ్రాశారు. ఉదాహరణకు డా॥ ఎ. వెంకటరామరెడ్డి "ఆంధ్ర ప్రబంధయుగం - అలంకార ప్రస్థానం," శ్రీ యన్. సీతాపతి "నాచన సోముని చమత్కార

ప్రస్థానం", శ్రీ మల్లంపల్లి సుబ్రహ్మణ్యశర్మ "తిక్కన కవిత అర్థగుణ ప్రాధాన్యం" శ్రీ జి.వై.ఎస్.ఎస్. శాస్త్రి "నన్నయ కవిత శబ్దగుణ ప్రాధాన్యం" అనే అంశాల మీద పనిచేశారు, మచ్చుకు పేర్కొన్న కొన్ని పరిశోధనలు మాత్రమే.

పూర్వ సిద్ధాంతాలకు గాని, వాదాలను గాని సవరించి, పరిష్కరించి, అభినవదృక్పథాన్ని అందించగలిగిన చైతన్యాన్ని కలిగించేవి నాలుగోరకం, వినూత్న సిద్ధాంత ప్రతిపాదన అయిదోరకం. ఈ రెండు కోవలకు చెందిన సిద్ధాంత గ్రంథాలు ఈ దశాబ్దపు ధోరణిలో రావడం కష్టం. వీటికి ఉదాహరణలు ఈ దశాబ్ది తెలుగు సాహిత్య విమర్శలో చూపించడానికి వీలున్నది కాని, పరిశోధనలో నాదృష్టికి అంతగా అందడం లేదు.

విశ్వవిద్యాలయాల్లో తెలుగు సాహిత్యం మీద వెలువడుతున్న సిద్ధాంత వ్యాసాలను గురించి ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క రకమైన అధిక్షేపం విద్యావంతులలో ఉండటం గమనిస్తూ ఉంటాం. 1950 - 60 దశాబ్దంలో తెలుగు సిద్ధాంత గ్రంథాలు బండ్లమీద కెత్తేటంత పెద్దవిగా ఉంటాయనే ఒక విమర్శ వినపడేది. తెలుగు పరిశోధకులు ఆ విమర్శను చిరునవ్వుతో ఎదుర్కొన్నారు. సాహిత్య యుగాలను, ప్రక్రియలను పరిశోధనాంశాలుగా ఎన్నుకుని, దేశంలో దొరుకుతున్న సామగ్రినంతా సేకరించి, భావితరాలవారికై తమ సిద్ధాంత వ్యాసాల్లో భద్రపరచిన పట్టభద్రులు ఆ దశాబ్దంలో పరిశోధన చేసిన విద్వాంసులు. నేటి పరిశోధన భవనానికి వారి రచనలే బలమైన పునాదులు. 1960-70 దశకంలో క్రమంగా బరువుతగ్గి బలం పెరగటం మొదలైంది. నారాయణరెడ్డి గారి 'ఆధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయం-ప్రయోగం', ఈ దశకం 1960-70లో వచ్చిన సిద్ధాంత వ్యాసాలన్నింటిలో అగ్రతాంబూలం అందుకుంటుంది. ఆధునికాంధ్ర కవిత్వాన్ని అనుశీలించే బాటలను బలంగా విమర్శన రంగంలో ఈ సిద్ధాంత గ్రంథం వేసింది. ఇప్పటికీ భావకవిత్వానుశీలనంలో నారాయణ

రెడ్డిగారి సిద్ధాంత ప్రభావం వివిధ పరిశోధన గ్రంథాలమీద స్పష్టంగా గోచరిస్తుంది. కొందరు పైకి చెప్పినా చెప్పకపోయినా ఇది వాస్తవం. ఈ దశాబ్దం (60-70) లో వచ్చిన సిద్ధాంత వ్యాసాల మీద అధిక్షేపాలు తక్కువ. ఈ పదేళ్ళలో పెరిగిన గౌరవం దాదాపు మరో పదేళ్ళవరకూ సాహిత్య క్షేత్రంలో నిలిచింది. దాదాపు 1975 ప్రాంతంనుండీ వెలువడిన సిద్ధాంత వ్యాసాలమీద మరో అపప్రథ ఉంది. 'చెప్పటం తక్కువ వివరించటం ఎక్కువ' అని, మరికొన్ని చోట్ల 'సొంతమాటలు తక్కువ. ఇతరుల అభిప్రాయాలెక్కువ' అని ఇవి అందరికీ అన్ని పరిశోధనలకూ వర్తించే మాటలుకావు. అయినా నూత్న సమన్వయాలు తగ్గి వివిధ దృక్కోణాలతో, ఒక సమస్యను పరిశీలించిన విశేషాలన్నింటినీ గుదిగుచ్చే ప్రవృత్తి ఎక్కువ కావటం చేత ఈ విధమైన సిద్ధాంత వ్యాసాలు అధిక సంఖ్యలో వచ్చాయి.

ఈ దశాబ్దం (1980-90) లో పరిశోధకులు ఎన్నుకుంటున్న సమస్యలు పరిమాణంలో పరిమితమైనవే. కాని, పరిశీలనంలో నిశితమైనవి. ఏకదేశమైన అంశమే వారి పరిశోధన పరిధి. కరీంనగర్ జానపదగేయాల్లో సాంఘిక జీవనం (1980) తణుకు తాలూకా గ్రామదేవతలు' (1987), 'తెలుగు కావ్యావతారికల్లో సాహిత్య విమర్శ' (1984) తెలుగు సాహిత్యం - ముస్లింల సేవ' (1984), 'మానసిక సామాజిక జీవన స్రవంతి; చివరకు మిగిలేది' (1988), 'ఆధునిక తెలుగు కవిత్వంలో సూర్యుడు' (1981), 'మొల్ల తీర్చిన సీత' (1985), 'పాలమూరు లేబర్ పాటల్లో ప్రజల జీవనం' (1990), తెలుగులో ప్రత్యేక సంచికలు' (1988), 'తెలిచిరాజు నవల - స్పర్శ సిద్ధాంతం' (1990) ఇలా ఉంటాయి ఈ ధోరణిలోని పరిశోధన సమస్యలు; సిద్ధాంత వ్యాసాలు ఈ ప్రవృత్తినే ప్రకటిస్తూ ఉంటాయి. పరిశోధన సమస్య చిన్నదైనకొద్దీ పరిశోధన పద్ధతి బలంగా ఉండవలసి వస్తుంది. ఈ దశాబ్దం ఆ అవసరాన్ని గుర్తించి, ఆ వైపు ముందడుగు వేసింది.

1985 నుండి పరిశోధనల్లో కాలం విలువ, కలం విలువ క్రమంగా పెరుగుతున్నాయి. నిర్ణీతమైన కాలంలో నిర్దిష్టమైన పరిశోధనా కార్యక్రమాన్ని సక్రమంగా పూర్తి చేయడం ఇప్పటి విశ్వవిద్యాలయ పరిశోధకుల కర్తవ్యం. ప్రతిభావంతులకు స్కాలర్ షిప్పులూ, గ్రంథసదుపాయాలూ, విరివిగా లభిస్తున్నాయి. పరిశోధన ఒక బాధ్యతాయుతమైన పండిత ధర్మమని ఇప్పుడు పరిశోధకులు క్రమంగా గుర్తిస్తున్నారు. విశ్వ సాహిత్యాల్లో జరుగుతున్న పరిశోధనలను పరిశీలించందే తెలుగు పరిశోధన సంతృప్తికరంగా సాగడం లేదు. అందువలన ఇంటి తలుపులు కిటికీలు తెరచుకుని చూడవలసిన అగత్యం ఏర్పడింది. బయటి వెలుతురు లోనికి ప్రసరిస్తోంది. దానితోపాటు నేటి పరిశోధకునికి తన ఇల్లు కూడా కాంతిమంతంగా కనపడుతోంది. బయటినుంచీ వస్తున్న వెలుగుతో తన ఇంట్లో ఉన్న వస్తువులను, వాటి విలువలను తాను మరింత గుర్తించ గలుగుతున్నాడు. ఈ దశాబ్దం తెలుగు సాహిత్య పరిశోధన అంటే తెలుగువాని ఆత్మ పరిశోధన అన్న అవగాహనతో ముందుకు సాగుతున్నది. ఒక వైపు భౌతిక దృష్టి పెరుగుతున్నకొద్దీ మరొకవైపు తరుగుతున్న ఆధ్యాత్మిక వ్యక్తిత్వం మానవుణ్ణి నైతికంగా మానసికంగా కుంగదీస్తోంది. సమతూకం కోసం అన్వేషిస్తున్నాడు మానవుడు జీవితంలో; సమదృష్టి కోసం పరిశోధిస్తున్నాడు సాహిత్యంలో.



• చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది •



